# ప్రేమ కవచం...!

అతనామె ఇంటికి దగ్గర్లోనే ఉంటున్నాడు. రోజూ ఆమె కాలేజీకి వెళ్ళేటప్పుడూ, తిరిగి వచ్చేటప్పుడూ ఆమె వెనుకే బాడీగార్డులా తిరుగుతుంటాడు. "నీకేం పనిలేదా? సిగ్గు లేదా? ఎందుకు ఇలా నా వెనుక తిరుగుతుంటావ్?" అని అడిగిందామె ఒకరోజు... అందుకతని సమాధానం– "ఈ ప్రాంతం మంచిదిగాదు. ఏ పోకిరీ వెధవా నీ జోలికి రాకుండా ఇలా జాగ్రత్త పడుతున్నాను" అని. అలా అన్న అతను అకస్మాత్తుగా ఎందుకు మాయమైపోయాడు? అతని కోసం నిరీక్షించే స్థితికి ఆమె ఎలా వచ్చింది?



# తెల్లదనానికి మొదటిది
# ప్రకాశానికి మొదటిది

TATA'S 501 BLUE DETERGENT BAR

## నీలం 501
### డిటర్జెంట్ బార్

"హెచ్చు
ఉతికే శక్తి!
హెచ్చు పొదుపు"



"ముద్ద కాదు, ఎక్కువ
రోజులు వస్తుంది
పుష్కలమైన నురుగు!"

## మరొక 501 విజేత

HTA97-3-293 TL

టాటావారి తయారి

**ఆంధ్రసచిత్రవారపత్రిక**

వ్యవస్థాపకులు
*దేశోద్ధారక కాశీనాధుని నాగేశ్వరరావు పంతులుగారు*
స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు
|1938—1972|

శుక్రవారం : 6-6-'80
రౌద్రినామ సం. అధిక జ్యేష్ఠ బ. అష్టమి
*సంపుటము 73 : సంచిక 41*

సంపాదకుడు
శివలెంక రాధాకృష్ణ

*

పోస్టులో ఏడాది చందా రు. 49-40
ఆరు మాసాల చందా రు. 24-70
విడి ప్రతి వెల 90 పైసలు
*ఆంధ్రపత్రిక కార్యాలయము*
గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

# పోస్ట్‌మన్ మీరు కోరే ఒకేవంట సాధనం.



## మంచి అలవాటు, ఆరోగ్యమైన అలవాటు

పోస్ట్‌మన్, అతి స్వచ్ఛమైన రిఫైన్డ్ వేరుశనగనూనె, ఎంతో ఆరోగ్యమైనది. ఎందుకంటే, దీనిలో నెయ్యి, వనస్పతిలవలెగాక, రక్తంలో కొలస్ట్రాల్ లెవెల్‌ను ఎక్కువ చేసే శాట్యురేటెడ్ క్రొవ్వులు తక్కువగా ఉంటాయి. పోస్ట్‌మన్ రుచి, వాసనలేనిది, అందువలన మీ శాకపాకాలు సహజరుచితో తయారయి, తేలిగ్గాను, రుచిగాను ఉంటాయి. పోస్ట్‌మన్ మళ్ళీ వాడవచ్చును, ఇందువల్ల మరింత పొదుపు. అందుకే చాలా మంది గృహిణులు పోస్ట్‌మన్‌ను ఒక్కదానినే వంట సాధనంగా నమ్ముతున్నారు.

పోస్ట్‌మన్–అత్యుత్తమ వంటసాధకాల అసలు రహస్యం తెలిసిన సంస్థనుంచి

## వంట, వేపుడు లేక బాగా వేపుళ్ళకోసం

## పోస్ట్‌మన్

ఆరోగ్యమైన సర్వ ప్రయోజక వంట సాధనం.

**అహమ్మద్ మిల్స్** బొంబాయి, కలకత్తా, న్యూ ఢిల్లీ, బెంగుళూరు, అహమ్మదాబాదు.




OBM-4538 TL

**ఇప్పుడే వెలువడింది!**




"ది పోస్ట్‌మన్ కుక్ బుక్." 150 విధములుగ నోరూరించే పిండివంటలు మరియు తీపి పదార్థములు (డిసర్ట్స్)— శాకాహార, మాంసాహార వంటలు, రంగు రంగులలో, మనోహరంగా చిత్రింపబడినవి. వెల : రూ. 40/—

అన్ని పుస్తకాల దుకాణాలలో దొరుకును. లేక రూ. 45/– మనియార్డరు చేసినచో (దీనిలోవి రూ. 5/– పాకింగ్ మరియు ఫార్వర్డింగ్ కోసం) పంపబడుతుంది. ఈ క్రింది చిరునామాకు వ్రాయండి. అహమ్మద్ మిల్స్, సీతారాం బిల్డింగ్, పాల్టన్ రోడ్, బొంబాయి 400 002














# ఉత్తరాలు

## జేజేలు!

ఆంధ్రపత్రికా నీకు జేజేలు
నా అభిమాన పత్రికా జేజేలు
నీలోన నిలిచేటి చిన్నారి కథలు
వాస్తవాలకు అవి ప్రతి రూపాలు
కవితలు కార్టూన్లు
కమ్మగా ఉండేను
ప్రశ్నలూ జవాబులు
సరదాగా ఉండెను
వార ఫలము నాకు
ముందుగా తెలిసేను
ముఖ చిత్రముతో
అందముగ ఉండెను
సినిమాల బొమ్మలు
కనువిందు చేసేను
ఆంధ్రపత్రికా నీకు జేజేలు
నా అభిమాన పత్రికా జేజేలు.

శ్రీదేవి [కాకినాడ]

## ముఖ చిత్రం

ఎన్. టి. రామారావు, జయప్రదల ముఖ చిత్రంతో వెలువడిన మీ[మా]ఆంధ్రసచిత్ర వార పత్రిక [దీ. 25.4.80నాటి] చూడ ముచ్చటగా ఉన్నది. కథలు బాగున్నవి. కాంచనగంగ సీరియల్ రసవత్తరముగా సాగుతున్నది.

ఎ. ధనంజయరెడ్డి, ఎ. వెంకటరమణారెడ్డి [వలివేరు]

## సీరియల్

'కాంచనగంగ' సీరియల్‌లో అపర్ణ పాత్ర చిత్రీకరణఎంతోఉన్నతంగా, ఉదాత్తంగా సాగుతున్నది. ఈనాటిరచనలలో అధిక శాతం స్త్రీలను ఆట బొమ్మగా,వ్యక్తిత్వహీనంగా, పురుష బానిసగా చిత్రీకరించబడడం చూస్తూ ఉన్నాము. దానికి భిన్నంగా తను నమ్మిన ఆదర్శాలకు, సిద్ధాంతాలకు కట్టుబడి, కట్టుకున్న భర్తనే తృణీకరించిన అపర్ణ వ్యక్తిత్వం నిజంగా శ్లాఘనీయం. సుధాగౌతమ్‌గార్కి నా అభినందనలు.

కుమారి ఇ. టి. దేవిప్రియ [శ్రీహరికోట]

## కథలు

ఈవారం [16.5.80] ప్రచురించిన కథల్లో 'భూతం' కథ నచ్చింది. 'స్వయంవరం' చివర్లో రచయిత్రి చేసిన ముగింపు అంత బాగాలేదు. 'షాక్ ట్రీట్‌మెంట్' కథలోలా ఏ స్త్రీగూడా ఆ విధంగా నటించదు. ఒకవేళ చలపతి అచటికి రాకపోతే...! ఈ కథలో రచయిత[త్రి] తను అనుకున్నదికథలో స్పష్టంగా రూపొందించలేదని నా అభిప్రాయం.

రావ్ అండ్ శర్మ [తాడిపత్రి] ●

సీరియల్

# తపోవనగంగ

సుధాగౌతమ్

(గత సంచిక తరువాయి)

"వెల్‌కమ్ డాక్టర్..."

అతడి కంఠం విన్న అపర్ణకి ఒక్క సెకను నరనరాల్లో చలి పుట్టుకొచ్చింది. ఇక తను అతణ్ణి తప్పించుకోలేదు. తిరిగి చూసి తీరాలి.

అతడు ఈ నేడు నిజాన్ని స్వీకరించక తప్పదు. తాను కూడా రాబోయే దాన్ని ఫేస్ చేయకా తప్పదు. క్షణ క్షణానికీ ఆమెలో కాఠిన్యం పేరుకుంటోంది. మనసు ఏదో దృఢమైన నిశ్చయానికి వస్తోంది.

మెల్లగా వెనుతిరిగిందామె.

భూమి రాకెట్ వేగంతో ఒక్క చుట్టు తిరిగినట్లయి క్షణం నివ్వెరబోయాడతను. ఆమె ముఖంలో ఏలాంటి భావమూ కనిపించడంలేదు. ఆమె రాగద్వేషాలకీ, బాంధవ్యాలకీ, బంధనాలకీ అతీతురాలిగా కనిపించింది.

అతడి నోటి వెంట మాట రావడం లేదు. ఉన్నత పర్వత శిఖరం ముందు గులకరాయిలా ఫీలవుతున్నాడతను. అతడి మనసులో భావాలే లేవు.

ఆమె హృదయంలో బాధ లేదు.

"నిలబడ్డారేం, అలా కూర్చోండి డాక్టర్ శ్రీధర్..." ఆమె కంఠం విని ఉలికిపడి, ఈ లోకంలోకొచ్చాడు. "అపర్ణా... మువ్వా..." మాటలు పెకిలి రావడం లేదు.

"నేను డాక్టర్ అపర్ణని..." ఆమె 'డాక్టర్' అన్న పదాన్ని ఒత్తి పలికింది.

"సారీ డాక్టర్..." తప్పనిసరిగా కూర్చున్నాడతను. "మీరు కవితను బతికించి..."

అతడి మాటల్ని మధ్యలోనే త్రుంచేసిందామె. "ఉపకారానికి ప్రత్యుపకారం చెయ్యడం మానవధర్మం డాక్టర్ శ్రీధర్ రావ్! మీ దయవల్లే ఈనాడు నేనింత పెద్ద డాక్టరునై, ఇంత పెద్ద నర్సింగ్ హోం నడుపుతున్నాను. మీ ఋణాన్ని ఏంతమాత్రమైనా తీర్చుకోకపోతే ఎలా?" అతడి హృదయానికి గురిచూసి కొట్టినట్లున్నాయ్

ఆమె మాటలు.

అతడామెను చూడడం లేదు.

"మీరు నాకు కృతజ్ఞతలు తెలుపుకో నవసరం లేదు శ్రీధర్! ఆ మాటలన్నీ డాక్టర్ వీలిమకు చెప్పేటప్పుడే విన్నాను. విన్న వాటిని మరీ మరీ వినే తత్వం నాది కాదు."

"నిన్ను అపర్ణా అని పిలిచే హక్కును నేను కోల్పోయానని నీవు గుర్తు చేశావ్. అయినా, నన్ను క్షమించు... అపర్ణా..." అతడి మాటలు తడబడుతున్నాయి.

"ఎందుకని క్షమించాలి డాక్టర్ శ్రీధర్" ఎదురు చూడని ఆ జవాబుకు సిగ్గుతో తల వంచుకున్నాడతను.

"శ్రీధర్– నా తమ్ముడు ఈ రోజున ఓ ఇంజనీరయి, ఇంటివాడై తన అప్యాయతని నాకు పంచిస్తున్నాడంటే, నా చెల్లెలు ఓ హృదయం కలవాడికి భార్యగా చల్లగా కాపురం చేసుకుంటూ నన్ను దేవతగా గౌరవిస్తూ ఉందంటే, నా బాబు రోజు రోజుకి పెరుగుతూ నా కళ్ళకు ఆనందం కలిగిస్తూ, నా జీవితానికి అర్థాన్ని కల్గిస్తుంటే..., దానంతటికీ కారణం ఎవరనుకున్నారు... మీరే శ్రీధర్... నాకు యింత మేలు చేసిన మీరు, నాకేం అపకారం చేశారని, ఏం తప్పు చేశారని నేను క్షమించాలి..." ఎంత నిగ్రహించుకున్నా ఆమె లోని ఆవేశం బయట పడుతోంది.

అవమానంతో అతడి ముఖం తీరు బారింది.

"అపర్ణా... నన్ను మాటల్తో చంపకు" అతడు రెండు చేతుల్తోను ముఖం రుద్దుకున్నాడు.

"నేను మీలాగే ఒక శరీరానికి జీవాన్నీ, ఒక జీవానికి జీవితాన్ని యిచ్చేలాటి డాక్టరుని శ్రీధర్. ఎవర్నీ చంపే హృదయంగానీ, ఉద్దేశంగానీ నాలో లేవు."

అతడిలో ఏనాడో రావల్సిన పశ్చాత్తాపం కలుగుతోంది. అయితే ఆ పశ్చాత్తాపానికి విలువలేదిప్పుడు. తనలో నిజమైన పశ్చా

జరిగిన కథ - 9 : 'గులాబీకి ముళ్ళుందు కుంటాయి' అన్న సమస్యను డాక్టర్ వీలిమ, సిస్టర్స్ దినా, ఫాతిమాలతో అపర్ణ చర్చిస్తుండగా, అబార్షన్ అయిన ఒకామెను ఆమె తల్లి అక్కడకు తీసుకువస్తుంది. కట్నం బాకీపడ్డ కారణంగా ఆమె భర్త తంతే ఈ విధంగా జరిగిందని చెబుతుంది. ఆమెను ఆపరేషన్ చేసి కాపాడిన అపర్ణ ఆలోచనలు గతంలోకి పరుగెడుతాయి. తాలూకా గుమాస్తా పరంధామయ్య, విశాలాక్షిలకు అపర్ణ, రవి, రజని సంతానం. అన్నింటిలోను ముందుండే అపర్ణను ఉన్నపాళం అమ్మి మెడిసన్‌లో చేర్పిస్తాడు పరంధామయ్య. అనుకోని విధంగా పరిచయమైన డాక్టర్ శ్రీధర్, అపర్ణ మనస్సులో చోటు చేసుకుంటాడు. అపర్ణ ఆశయాలను, బాధ్యతలను స్వీకరించి, పెండ్లి చేసుకొంటానని ఆమెతో చెప్తాడు శ్రీధర్. శ్రీధర్, అపర్ణల పెళ్ళి అయిన అనంతరం పరంధామయ్య మరణిస్తాడు. ఆ తరువాత శ్రీధర్‌లో వచ్చిన మార్పును చూసి సహించలేక పోతుంది అపర్ణ. శ్రీధర్‌తో తెగతెంపులు చేసుకొని, తన వాళ్ళని తీసుకొని వెళ్ళిపోయిన అపర్ణ మీరా సహాయంతో 'పెద్దపర్సన్' అవుతుంది. ఆమెకు కొడుకు పుడతాడు. తన ఆదర్శాలకు అనుగుణంగా, కానీ కట్నం తీసుకోకుండా రంగనాథం గారమ్మాయి రమతో రవి పెళ్ళి జరిపిస్తుంది అపర్ణ. ఏ ఆదర్శానికి అనుగుణంగా తన తమ్ముడి పెళ్ళి చేసిందో, అదే ఆదర్శంతో చెల్లెలు రజనికి పైసా కట్నం ఇవ్వకుండా వేణుతో పెళ్ళి జరిపిస్తుంది డా. అపర్ణ. గతంలోంచి బయట పడుతుంది అపర్ణ. ప్రాణాపాయంలో వున్న శ్రీధర్ రెండొవ భార్య కవితకు ప్రాణభిక్ష పెడుతుంది. తన భార్యను రక్షించిన 'డాక్టర్'కు కృతజ్ఞతలు చెప్పుకోవటానికి వస్తుంటాడు శ్రీధర్. అతనిని అన్నివిధాలా ఎదుర్కోవటానికి సిద్ధంగా వుంటుంది డా. అపర్ణ.

త్వాసమే కలుగుతున్నా లోకం నమ్మదు. లోకంతో పనిలేదు తనకు. తనకు కావల్సింది అపర్ణ తనని అర్థం చేసుకోవడం.

అయితే అపర్ణలో ఎంత ప్రేమ ఉందో, అంత త్యాగం ఉంది. ఎంత అభిమానం ఉందో, అంత ఆత్మ గౌరవమూ ఉంది. ఎంత సౌకుమార్యం ఉందో, అంతే కాఠిన్యమూ ఉంది. ఎంత బలహీనత ఉందో, అంతే కాఠిన్యమూ ఉంది. చాలా విచిత్రమైన, విభిన్నమైన వ్యక్తిత్వం ఆమెది. అది తనకు బాగా తెలుసు. తను అపర్ణ మనసు మార్చలేదు. కేవలం తన మానసిక దౌర్బల్యంతో, క్షణికమైన స్వార్థంతో ఆమె వ్యక్తిత్వం పైనే పెద్ద దెబ్బతీశాడు. తన అల్పత్వంతో ఆమె జీవితాన్నే మార్చివేశాడు. శ్రీధర్‌లో ఏవేవో ఆలోచనలు ఆగకుండా కలుగుతున్నాయి.

అపర్ణ ఆత్మబలం, ఆత్మవిశ్వాసం కల ఆడది కనుక, జీవితంతో నిర్భయంగా పోరాటం సాగించ కలిగింది.

స్థైర్యం గలది కనుకే బాధల్ని, గతాన్ని మరచి, భవిష్యత్తును దిద్దుకో గలిగింది అదే వేరే ఆడది గనుక అయ్యుంటే ఆమె జీవితం ఏమయ్యుండేది ?

శ్రీధర్‌కి తన మీద తనకే అసహ్యం వేసింది.

అలాంటి అపర్ణకి తనేం చేశాడు ?

అయినా అపర్ణ కవితకి ప్రాణ భిక్ష పెట్టింది.

'కవిత ఎవరనేది నీకు తెలుసా ... అపర్ణా ?' అడక్కూడదనుకుంటూనే అడిగేశాడు. 'తెలిసీ ఆపరేషన్ చేశావా ?'

అవును డాక్టర్ శ్రీధర్! జీవితంలో చేదు నిజాల్ని ఎదిరించే, సహించే శక్తి, నిగ్రహమూ, మీ నుండే నేర్చుకున్నాను. ఇదేం అంత పెద్ద టెస్టింగ్ పాయింట్ కాదు నా జీవితంలో.

ఆమె మాటల్లోనే, ఆమెకు తనపై ఎంత పగ, కోపం ఉందన్నది అర్థం అవుతోందతనికి.

అయినా అమె మంచు కప్పిన అగ్నిపర్వతంలా వుంది.

"తెలిసే చేశాను శ్రీధర్. నాకు నీపై ద్వేషం ఉండవచ్చు. ఆ ద్వేషాన్ని కవితపై ప్రతీకారరూపంలో చూపేలాంటి నైచ్యం నాలో లేదు. ఆ క్షణాన నా హృదయం



కొంచెం సంఘర్షణకు లోనై ఉండవచ్చు. కానీ, నేను డాక్టర్ని. చావు బ్రతుకుల్లో వున్న జీవాన్ని బ్రతికించడం నా ధర్మం, ధ్యేయం, ప్రథమ కర్తవ్యం అన్నది నేను మరచిపోలేను. నా వృత్తి ధర్మం ముందు, పేదా గొప్పా, ఆడా మగా, మతమూ, తెగా, స్నేహం శత్రుత్వం, రాగం ద్వేషం ఏ వొక్కదానికీ సంబంధం లేదు. వాటికి నా మనసు తల వంచదు.

ఇంతకీ నీమీద పగ ఆమెపై ఎందుకు తీర్చుకోవాలి? మిస్టర్‌రావ్! దాన్నుంచి నాకు కలిగే లాభం ఏమిటి? మళ్ళీ మిమ్మల్ని చేరుకోవచ్చుననా? ఆ ఆశ నాలో లేదు. ఆ అవకాశం వచ్చినా అది జరుగదు శ్రీధర్. ఇక డబ్బా ?

అది నాదగ్గర చాలానే వుంది. డబ్బుతో జీవితాన్ని నే నెన్నడూ కొలవను డాక్టర్ శ్రీధర్. మనిషినీ, డబ్బునూ ఒకే త్రాసులో తూచడం కాదు కదా, అసలు పెట్టనే పెట్టను. నేను డబ్బుతో నా జీవితాన్ని మలచుకోవటం లేదు డబ్బుకు నేను బానిసను కాను. డబ్బు మనిషికి దాస్యం చేయాలికాని, మనిషి మనసు డబ్బుకు బానిస కాకూడదు..."

ఆమె మాటలు ఒక్కొక్కటే ఒక్కొక్క శూలంగా గుచ్చుకుంటున్నాయి అతడి హృదయంలో.

"కాబట్టి ఆమెను బ్రతికించడంలో డబ్బు పాత్ర కూడా లేదు. కవిత చావు బ్రతుకుల్లో వచ్చింది హాస్పిటల్‌కి. ఆమె పేషెంట్. నేనో డాక్టర్. ఆపరేషన్‌కి రెడీ అయినాకనే తెలిసింది, ఆమె మీ 'భార్య' అని. ఆ నిముషాన నా హృదయం సంఘర్షణకి లోనైనా నా కర్తవ్యమే గెలిచింది. ఎప్పుడూ గెలుస్తుంది. నేనంత మానసికంగా బలహీనురాల్ని కాను. ఏ బలహీనతకీ మనో దౌర్బల్యానికీ సులభంగా లొంగిపోయే దాన్ని కాను. ఆ నిజాన్ని మీరనుభవించారు."

ఏం మాట్లాడినా మాటలు సూటిగా అతడికే తగులుతున్నాయి.

అంతలో హాస్పిటల్ ముందు కారాగిన శబ్దానికి అటు తిరిగి చూశారిద్దరూ.

చేతో స్కూల్ బాగ్ ఊపుకుంటూ పరిగెడుతూవస్తున్న సుజన్‌ని చూసి క్షణం నివ్వెరబోయింది అపర్ణ.

అనుకోని సమయంలో బాబు అలా హాస్పిటల్‌కి వస్తాడనుకోలేదు. అనవసరంగా బాబుని శ్రీధర్‌కి చూపే ఉద్దేశం ఆమెలో ఉండలేదు ఐతే బాబు రానేవచ్చాడు. విధి అంతర్యం ఏమిటో? ముందు ఏం జరగబోతోందో ?

ఎంత ధైర్యం ఉన్నా తను బాబును వొదులుకోగలదా ?

ఆమెలోని మాతృహృదయం మెత్తబడసాగింది.

శ్రీధర్‌ని వదలి తను యిన్ని సంవత్సరాలు జీవించగలిగింది. కానీ బాబు అతడితో వెళ్ళిపోతానంటే, తను సహించగలదా ? బాబు ఎదురుగా లేకపోతే తను క్షణం జీవించలేదు

బాబు అడుగులు దగ్గర పడుతున్న కొద్దీ దానికి లయగా ఆమె హృదయం వేగంగా స్పందిస్తోంది.

సిస్టర్ దీనతో కబుర్లాడుతూ, నవ్వుకుంటూ రానే వచ్చాడు.

'అమ్మా' అని పిలిచిన బాబు పిలుపు యిద్దరి హృదయాల్నీ సమ్మెటలా కొట్టింది.

శ్రీధర్ ఉలికిపడి అటు చూశాడు.

తెల్లటి కాన్వెంట్ యూనిఫాంలో, తెల్లగా అందంగా ఆరోగ్యంగా బాబు అందర్నీ ఆకర్షించేలా ఉన్నాడు. కళ్ళు చిలిపితనంతో కళ కళా మెరుస్తున్నాయి. కంట్రోల్ లేని క్రాపు నుదురు మీద వచ్చి పడుతోంది.

సర్వస్వాన్నీ మరచి చూస్తున్నాడు శ్రీధర్. అతడిలో రక్తం ఉప్పొంగుతోంది. సంతోషం కట్టలు తెంచుకుని పెల్లుబుకుతోంది.

బాబు, అవును తన బాబే !

ముమ్మూర్తులా తన పోలికే!

అతడికి, బాబును అమాంతం కౌగిలించుకుని ముద్దాడాలనిపించింది అతడిలో కలుగుతున్న మార్పుల్నీ, భావాల్నీ గమనిస్తూనే ఉంది అపర్ణ

వింతయిన కన్న తండ్రి !

ఆ పాశాన్ని తను కాదవలేదు. ఆ బంధాన్ని వేరు చేసే అధికారం తనకు లేదు —అనుకుంది.

తను వేరు చేయలేదే ? అతడే, తెంచుకున్నాడు.

శ్రీధర్ లో బాబు పై ఈ మమకారం యిన్నాళ్ళూ ఎక్కడ పోయింది? కవిత ప్రేమ మరపించిందా? లేక ఆమె ఐశ్వర్యం కళ్ళు గప్పిందా ? కాదనుకుని తెంచేసుకున్నాడా ?

బాబు పై నిజమైన తండ్రి కుండదగ్గ వాత్సల్యం ఇన్నాళ్ళూ ఏమైంది? ఎందుకని నిర్లక్ష్యం చేశాడు ? ఉన్నట్టుండి ఒక్కసారిగా ఈ అభిమానం పెల్లుబకడంలోని ఆంతర్యం ఏమిటి?

కేస్ రిపోర్ట్ చదివిన శ్రీధర్, కవితకి మాతృత్వం తిరిగి పొందే సూచనలు చాలా తక్కువగా ఉన్నాయని తెలుసుకున్నాడా ? ఎంతైనా డాక్టర్ కదా ! అందుకనే ఉన్నట్టుండి వచ్చిందా తన కొడుకు పై ఈ మమకారం? అదే నిజమైతే, తాను దాన్ని ఏ విధంగానూ హర్షించలేదు. ఇంతకి జరగబోతున్నది ఏమిటి ?

బాబు, శ్రీధర్ వైపు తదేకంగా చూస్తూ కొత్త అనో, తన పోలికల్ని చూసుకుంటున్నాడో అన్నట్టు అతడి ముఖంలో అలాగే చూస్తూ నిలబడి పోయాడు.

కంటి కెదురుగా ఉన్న వ్యక్తి తన కన్న తండ్రి అన్న విషయాన్ని దాచడానికి ఎందుకనో ఆమె మనసు ఒప్పుకోవడం లేదు. ఏనాటికైనా నిజం తెలిసివచ్చినా, తన బాబు తనని క్షమించలేడు. అది తను సహించలేదు, తన బాబు తనని తక్కువగా అనుకోవడం తను భరించలేదు. బాబుకు నిజం చెప్పాలి. వాడు అబద్ధాల్లో పెరగకూడదు. నిజం తెలుసుకున్న బాబుకి, నిర్ణయాన్ని కూడా వదిలెయ్యాలి. వాడు జీవితాన్ని సమస్యల్ని ధైర్యంగా తనలా ఎదుర్కొనే వ్యక్తిత్వం కలవాడుగా పెరగాలి కానీ, అబద్ధాల తెరల చాటున తిరిగే పిరికి పిడలా



పెరగకూడదు. తండ్రికి స్వభావంలో కూడా ప్రతి రూపం కాకూడదు ఆమెలో ఏదో సంకల్పం!

"బాబూ... ఎదురుగా కూర్చున్నది... మీ నాన్న ... గారు..." ఆమె కంఠం అనుకోకుండా వణికింది. కళ్లలో చిమ్మి కన్నీటిని మాత్రం బలవంతాన ఆపింది.

శ్రీధర్ ఉలిక్కిపడ్డాడు.

అపర్ణ తానుగా బాబుకు తను కన్న తండ్రి అని చెబుతోంది. ఇదెంత నిజం! బాబులోని మార్పునే గమనిస్తోంది అపర్ణ ఆమెలో రక్తం చాలా వేగంగా ప్రవహిస్తోంది.

బాబు మొహం వెడల్పయింది పెదవిపై చిరునవ్వు విరిసింది. అంతే! మరే భావాలూ లేవు

'నమస్కారం' అంటూ చేతులు జోడించి బాబు గిరుక్కున తల్లి వైపు వచ్చాడు. "మమ్మీ! కాన్వెంట్ వాళ్ళు టూర్ వెళ్తున్నారు మమ్మీ డబ్బులు ఈ వారే కట్టాలిట, యివ్వాళే మర్చిపోయా మమ్మీ. నువ్వు యింట్లో లేవుగా, అందుకే హాస్పిటల్‌కి పర్మిషన్ లేకుండానే వచ్చేశాను... సారీ మమ్మీ.."

బాబు తనవైపు చూపిన నిర్లక్ష్యానికి గాయపడ్డాడు శ్రీధర్. ఏం! బాబు నిండా వాంట్లో తప్పేముంది? బాబుకు తనెంత తెలుసని? తల్లి చూపిన నమస్కారంలో తనెంత వాడిగా చూపగలిగాడు? పదేళ్ల కాలం తను నిర్లక్ష్యం చేశాడే వాణ్ణి, ఈనాడు వాడి నిర్లక్ష్యానికి తను కోపం చేసుకునే హక్కు ఎక్కణ్ణుంచి వస్తుంది?

"అలా కూర్చో మిజన్..." అంటున్న తల్లి మాటలకి తల్లికి పక్కనే ఉన్న కుర్చీలో కూర్చున్నాడు.

"బాబూ... నీకో విషయం చెబుతాను వింటావా..." ఆమె స్వరం ఏ వణుకూ లేకుండా చాలా దృఢంగా ఉంది.

"నాన్నగారు నిన్ను తనతో తీసుకెళ్తారట..."

శ్రీధర్ మధ్యలోనే అందుకున్నాడు. "నీవు కూడా రావాలి అపర్ణా.." అనుకోని ఆ మాటలు విని నిశ్చేష్టురాలయింది అపర్ణ.

శ్రీధర్ తనని రమ్మంటున్నాడు.

తను పోవాలా?

పోతుందా?

ఎందుకు పోవాలి?

తనపై అతడికేం అధికారం ఉంది? అతడిపై తనకేం అనురాగం ఉందని తను పోవాలి?

అతడనుకున్నట్లు తనుపోతే కవిత స్థితి ఏమిటి?

తను వస్తానని ఎలా అనుకోగలిగాడతను?

బాబు వస్తే, తనూ వస్తుందనుకున్నాడా?

తనంత బలహీనురాల్నని ఎలా అనుకున్నాడు.

బాబుకూ, అతనికీ మధ్య రక్తపాశం, బంధం ఉండవచ్చు. తనకీ అతడికీ మధ్య ఏం అనుబంధం మిగిలిందని? యిద్దరి మధ్యా ఏం అనురక్తి ఉందని?

ఆమెలో ఏవేవో ప్రశ్నలు ఒకదానితో ఒకటి ఢీకొంటున్నాయి. అతడాశించినట్లు వెళితే తను అతడితో, అతనితో పాటు గడిపే జీవితంతో రాజీ పడగలదా?

శ్రీధర్‌లో ఉత్కంఠ ఎక్కువౌతోంది. ఆమె అలసత్వాన్ని భరించలేక పోతున్నాడు. ఆమె జవాబు ఏమిటో?... అతడి హృదయంలో రక్తం హోరు మంటోంది

హృదయం వేగంగా కొట్టుకోవడం తనకే వినిపిస్తోంది.

"నేను రాలేను శ్రీధర్" ఆమె ముఖం అటువైపుగా తిప్పుకొంది. మొదటిసారిగా ఆమె కళ్ళు చెమర్చాయి.

అది తన బలహీనత కాదని తెలుసు.

అతడడిగిన ప్రశ్న, అతడి పిలుపూ ఆమెకు అవమానం అనిపించింది.

రమ్మన్నప్పుడు రావడానికి తనేం వ్యక్తిత్వం లేని, అభిమానం లేని తోలు బొమ్మ అనుకున్నాడా?

అతడితో జీవితమే జీవిత పరమార్థం అనుకొంటే, అతణ్ని తను వదలి వచ్చేదే కాదు ఇన్నేళ్ళ తర్వాత అతడితో పాటు పోవడంలో అర్థం లేదు. పోయినా 'కవిత' ప్రశ్నగానే మిగిలిపోతుంది. ఆమెలోని స్త్రీత్వం మేల్కొంది తను వెళ్ళదు. అది నిశ్చితంగా ఏనాడో నిర్ణయించుకున్న విషయం. కానీ బాబు ముందు ఆ విషయాలు విశదంగా చర్చించడం 'బాగు' అనిపించలేదామెకి.

సూటిగా, స్పష్టంగా బదులిచ్చింది. "డాక్టర్ శ్రీధర్! జీవితమంటే బొమ్మలాట కాదు జీవితాల్తో చెలగాటమాడడం పిల్లలాడుకునే ఆటకాదు. మీరు నాకు చేసిన అన్యాయాన్ని స్త్రీగా నేను కవితకు చెయ్యలేను... యిది నా ఆఖరు నిర్ణయం. యిక ఏ ప్రశ్నలూ, ప్రాధేయపడడాలూ వద్దు నా విషయంలో. నా నిర్ణయం మారదు" అపర్ణ ముఖం రోషంతో ఎర్రనైంది అమె గట్టిగా ఊపిరి పీలుస్తోంది.

"బాబు మీ కొడుకు. చట్టం ద్వారా నేను వాణ్ణి మీనుండి వేరు చేయవచ్చు. జీవితాన్ని విడదీసేవి, కలిపేవి చట్టాలూ డబ్బూ ఏనాటికీ కాకూడదు శ్రీధర్ ఆ సహాశక్తి మమతకూ, మనసుకూ మాత్రమే



ఉంది. కాబట్టి బాబు మీతో వస్తే... నేను ఏనాటికీ కాదనను..." ఆమె కళ్ళ నుండి నీరు ధారగా కారుతోంది.

ఆమె హృదయమే ద్రవించి కళ్ళలో ప్రవహిస్తున్నట్టుంది. శ్రీధర్‌కి ఆమె మనిషిలా కనబడ్డంలేదు. మానవత్వం పరిణతి పొంది నిలిచిన అచంచల శిఖరంలా కనబడుతోంది.

ఆమె నిర్ణయానికి తిరుగులేదని అతనికి తెలుసు. యిక ఆమెను అడగడంలో, ప్రాధేయపడ్డంలో లాభంలేదు. యిక తన ఆశ బాబు మీద ఒక్కటే!

ఆశతో బాబు వైపు చూశాడు, తనతో రమ్మనేలా. బాబు రెండు నిముషాల పాటు తండ్రి కళ్ళలోకి చూశాడు. పెద్ద విషయాలు అర్థం చేసుకునే వయసు కాదు బాబుది. తల్లీ తండ్రీ సంభాషణ అతడికి అర్థం కాలేదు. ఆ చిన్ని బుర్రకి అర్థమయింది ఒక్కటే. తన తల్లీ తండ్రీ వేరుగా ఉంటున్నారు. ఈ పదేళ్ళలో తన తండ్రి ఒక్కమారు కూడా తనను చూడడానికి రాలేదు. ఈనాడు తను అతడితో ఎందుకు పోవాలి?

తన తల్లి తన ప్రేమనంతా గుమ్మరించి తనను పెంచుకొంది. తనే అమ్మ లోకం అని తెలుసు, ఆమెను వదలి తను పోగలడా?

తల్లినీ తండ్రినీ మార్చి మార్చి చూశాడు పసివాడు. తండ్రి మామూలు మనిషిలాగానే ఉన్నాడు. అమ్మ మాత్రం వాత్సల్యాన్ని చిందించే మాతృత్వం తొణికిసలాడే కళ్ళల్లో దేవతలా కనిపిస్తోంది.

చివాల్న లేచాడు బాబు. "అమ్మా! నే వెళ్తున్నాను టైం అవుతోంది" అన్నవాడల్లా తండ్రి ముఖమైనా చూడకుండా, రివ్వున పరిగెట్టాడు ... అతడి పరుగులోనే శ్రీధర్‌కి జవాబు దొరికింది.

"బాబూ... యిదో... ఒకమాట, ఈ డబ్బులైనా తీసుకుపో..." అన్న తల్లి మాటలు కూడా వినిపించుకోకుండా పరిగెట్టాడు కార్‌వైపు. అతడేదో చెప్పాడు. డ్రైవర్ కార్‌ని స్టార్ట్ చేయగా రివ్వుమని వెళ్ళిపోయింది. ఆ చిన్నారి హృదయానికి కలిగిన గాయం తను మాత్రమే అర్థం చేసుకోగలదు. అదే బాబు యిచ్చిన జవాబు.

శ్రీధర్ నోట మాట రావడం లేదు, అతడిలో ఏవేవో భావాలు. ఆ చిన్న హృదయానికి తగిలిన గాయం తను ఏనాటికీ

# కాంచనగంగ

నయం చెయ్యలేదు. బాబు ముమ్మూర్తులా నన్నుపోలి ఉండవచ్చు. కాని వ్యక్తిత్వం మాత్రం తల్లిదే! యిద్దరూ తన ముందు ఓడిపోలేదు. తను చేతులారా చేసుకున్న తప్పిదం, తనను ఈనాడు మూగవాడిగా చేసింది వారిద్దరి ముందు, ఇలా చిత్తుగా ఓడిపోయేలా చేసింది.

అయినా చివరి ప్రయత్నం చెయ్యాలను కున్నాడు, అంత అవమానాన్నీ, ఆశాభంగాన్నీ సహించి కూడా.

"అపర్ణా నువ్వు వస్తే... నువ్వు నన్ను క్షమిస్తే బాబు తప్పకుండా క్షమిస్తాడు." తల వంచుకునే అడిగాడు.

## ఋతు రీతి

ఎండా కాలంలో
కుండలకే గిరాకీ
వానా కాలంలో
స్నానాలు ఉచితం
శీతా కాలంలో
కోకా కోలాహలం.

## అంతా ఎదుగే!

పెరుగు తినే నాయకులు
పెరుగుతూనే వుంటారు
చిరుగు బతుకుల వారు
తరగమన్నా తరగరు.

– నిష్ఠల వెంకటరావు

"నేను వస్తే కవితనేం చెయ్యాలను కున్నారు మీరు? నేను మీతో రాలేను శ్రీధర్. ఇలాంటి పిచ్చిపనులతో చేసిన తప్పు మరో మారు చేసి కవిత జీవితం కల్లోలం చెయ్యకండి. బాబును మీతో వెళ్ళమనికూడా నేను శాసించలేదు. వాడి లేత మనసు స్వచ్ఛంగా, స్వేచ్ఛగా ఎదగాలి. వాడినిర్ణయం వాడు తీసుకున్నాడు. వాడు ఏ బలవంతం లేకుండా తానై మనస్ఫూర్తిగా మీతో వస్తా నన్ననాడు నేను ఏవిధంగానూ పర్వతంలా మీ ఇద్దరి మధ్యా అడ్డు నిలబడతాననుకోకండి. నేను మిమ్మల్ని క్షమించగలను కానీ, మీతో జీవితమే గడపలేను, బలవంతాన ఆత్మ వంచన చేసుకోలేను. అలా వచ్చినా మన జీవితాలు అతుక్కున్నట్టుంటాయి గానీ, అనురాగంతో సంగమిచ్చినట్టుండవు శ్రీధర్. నన్ను బలవంతం చెయ్యకండి ఈ విషయం తెలిస్తే కవిత చాలా బాధ పడుతుంది. ఆమె మనసు బాధ పెట్టడం మీకు భావ్యంకాదు. యిటువంటి సందర్భంలోను కవితకి – 'నేను' నేనేనని తెలుపకండి. అందు నుంచి వరో జీవిత మనశ్శాంతి, జీవితానికి అర్థం లేకుండా పోతుంది. చేసిన తప్పే మరీ చేయడం అవివేకుల లక్షణం. దేవుడు దయతలిస్తే కవిత తల్లి కావచ్చు. ఆనాడు తప్పకుండా మీకు బాబు లేని లోటు తీరిపోతుంది."

అతడు కుంచించుకు పోతున్నాడు. ఆమె ముందు ఓ చిన్న అణువులా శిలౌతున్నాడు.

ఆమె అతని ముందు పర్వతంలా ఎదిగి పోతోంది. ఉన్నతంగా, ఉదాత్తంగా.

ఆమెది పరిపూర్ణత పొందిన స్త్రీత్వం!

ఆమెను తను ఏనాటికీ అందుకోలేడు.

ఆమె ఎత్తును తను ఏనాటికీ చేరలేడు.

భర్తతో పాటు తాను కూడా డాక్టర్‌కి కృతజ్ఞతలు చెప్పుకోవాలని సిస్టర్ దీన సాయంతో వచ్చిన కవిత, వారి మాటలు విని స్థబ్దురాలైంది. ఆమెలో...ఏదో సంచలనం!

భావ సంచలనం! డాక్టర్ అపర్ణ! తనకు జీవితాన్ని ప్రసాదించిన... డాక్టర్ అపర్ణ శ్రీధర్ జీవితంలో ఓమారు, యిప్పుడు ప్రాణదానం చేసి ఓమారు ఈ లోకంలో రెండుమార్లు తనకు స్థాన భిక్ష పెట్టిన అపర్ణ! భర్త జీవితంలోంచి ఈ మారు తాను తప్పుకుని... అపర్ణకి స్థానం యివ్వాలనుకుంటోందామె మనసు.

కానీ... అయిదు నిమిషాలు డాక్టరు సంభాషణ విని, ఆమె అచంచలమైన నిశ్చయాన్ని... ఆత్మ విశ్వాసాన్ని అర్థంచేసుకో గలిగింది తను.

ఆమెను తను మార్చలేదు. తను అల్పురాలు, ఆమె ఉన్నత పర్వత శిఖరం. తెల్లగా, పరిశుభ్రంగా, నిర్మలంగా, పవిత్రంగా ఆకాశపు టంచుల్ని చుంబిస్తూ... మంచులోనే... జీవవాహినుల్ని సృష్టిస్తూ, నందనాన్ని ప్రసరిస్తూ... జీవితాన్ని ప్రసాదిస్తూ... అచంచలంగా నిలబడిన ధవళ హిమగిరి శిఖరం!

ఆమె... కాంచన గంగ!!

(అయిపోయింది)




# కొత్తది!

గోద్రెజ్

# ఎవిక్స్

నీలిరంగు డిటర్జెంట్



మురికిని లాగి పారేస్తుంది

అధనంగా తెల్లదనాన్ని అందిస్తుంది

ఎవిక్స్ బట్టలకు తెల్లదనాన్ని, తళతళను కలిగించేందుకు సరికొత్త మార్గం.
ఎవిక్స్‌తో మురికి వదిలి పోతుంది.
ఎవిక్స్ లో తెల్లదనాన్ని అందజేసే శక్తివంతమైన పదార్థం ఉంది. అది మీ బట్టలకు ఇంతకు ముందెన్నడూ లేనంత తెల్లదనాన్ని, తళతళను సమకూరుస్తుంది.
ఎవిక్స్ ప్రత్యేకంగా సూత్రీకరింపబడింది. ఇది ముద్దగా కాదు, గరుకుగా అయిపోదు.
ఎవిక్స్ ఒకే ముక్కలా పడుంటుంది గనక పూర్తిగా అరిగిపోయేదాకా వాడేపీలు.
ఎవిక్స్‌తో మీరు ఎక్కువ బట్టలను ఉతికే సదుపాయం. పొదుపుచేసే అనువు. నిజానికి డిటర్జెంట్ సబ్బు బిళ్ళలు అలా ఉండాలనేగా మీరు కోరుకునేది—అందుకే నేడే కొనండి.

ముద్దగా అయిపోని

# ఎవిక్స్

నీలిరంగు డిటర్జెంట్ కేక్

చాలాకాలం ఆటివచ్చేది

# ఫాలాక్షుని డైరీ

## కొండ దేవత శాపం!

ఆంధ్రప్రదేశ్‌కు చెందిన "సుగాలీ" అనే వో కొండ జాతి వారికి ఆంధ్ర ప్రభుత్వం కష్టపడి సుమారు అయిదువేలయిదొందలిళ్లు కట్టించి, ఉండండి బాబుల్లారా అంటే, వారు ససేమిరా అన్నారుట. ఏల? అని అడిగితే తాము తమ తమ నివాసాలు ఆవాసనీలా వదలి రామనీ అలా వస్తే తమ సంపద, ఆరోగ్యం స్థితి, గతిఅన్నీ వరిగిపోతాయని, తమ కొండ దేవత శపిస్తుందనీ ముక్త కంఠంతో చెప్పారట. ఇది వారి నమ్మికట!! వారి నమ్మికేమిటో అడిగాక కట్టించేసి పోలా!!

## అలవాట్లో పొరపాటు !

ఢిల్లీ విశ్వ విద్యాలయానికి చెందిన వో ఉత్సవంలో పాల్గొన్న కేంద్ర విద్యామంత్రి శంకరానంద్ గారు మాట్లాడుతూ యూనివర్సిటీ గ్రాంట్స్ కమీషను కేవలం డబ్బు ఖర్చు పెట్టడానికి తప్ప మరెందుకూ కొరగాదని బల్ల గుద్ది వాక్రుచ్చారట. తీరా ఆ కమీషనరులో ముఖ్యుడయిన సతీష్ చంద్ర ఆ మాటను ఒప్పుకోనట్లు తలఅడ్డం తిప్పే సరికాయన ప్లేటు ఫిరాయించి, తన ఆ మాటకొక కామా తగిలించి ఆ కొరగాదన్న పదానికిముందో కొరగాదన్న పదం చేర్చి "మరెందుకూ కొరగాదన్న పదం యిప్పుడు కొరగాదు" అనేశారట. ఆతరువాత వాక్ప్రవాహంలో ఆయన మన దేశంలో స్త్రీల శాతం పురుషుల శాతంకన్నా చాలా ఎక్కువనీ, అది రాన్రానూ ఎక్కువవుతూనే ఉన్నాదనీ, కనుక తాను స్త్రీ విద్యనూ, విద్యా సంస్థలనూ ప్రముఖ్యతెక్కువిస్తానని అనే బల్ల మరోసారి గుద్దారట. విద్యావంతులైన శ్రోతలు మరోసారి తెల్లబోయి చాలా సేపటికిగానీ తెప్పరిల్లలేదట. కాస్త పెందరాడే తెప్పరిల్లిన వో శ్రోత అప్పుడు తెప్పరిల్లుతున్నవారుగు శ్రోతతో మంత్రి గారు మాట్లాడేవిషయాన్ని విషయం తెలిసిన ఎవరి చేతనైనా రాయించుకు రాకూడదూ, యిలా మన్నలి చంపక పోతే అంటూ ఉస్సురుమన్నాడట కారణం!! ఈనాటి లెక్కల ప్రకారం దేశంలోని యువ జనాభాలో స్త్రీల సంఖ్య చాలా తక్కువట. దేశ జనాభాలోవారి సంఖ్య తక్కువేగాక, ఆ శాతం తగుతూ వస్తూందట కూడానూ !

## నిరాశతో ఆత్మహత్య !

మెట్టూరుకు చెందిన వో హరిజన కాలనీకి చెందిన 26 ఏళ్ల తంగవేలు పెళ్లయి ఏడాదిన్నర్థమయి, పిల్ల పుట్టి అయిదు నెలలు అయినా తనకింకా ఉద్యోగం దొరకలేదన్న వైరాగ్యంతో ఎలక్ట్రిక్ స్తంభం ఎక్కి కరెంటు తీగలను పట్టుకు ఆత్మహత్య చేసుకున్నాడట.

## అమెరికాలో తగ్గుతున్న ధూమపానం !

అమెరికనులు "సిగరెట్లు కాల్చరాదు కాల్చరాదు" అని ప్రకటనలు చూసిచూసి వో రకమయిన మానసిక మార్పును పొంది, తత్ఫలిత భయంతో సిగరెట్లు కాల్చే వారిలో కొందరు మానడం, బోల్డు కాల్చే వారు కొంచెం తక్కువ కాల్చడం చేస్తున్నారని అమెరికాలో వో పెద్దాయన లెక్కలు తేల్చాడట. అక్కడ సిగరెట్లు కాల్చే వారి సంఖ్యా, కాల్చే సిగరెట్ల సంఖ్యా కూడా దినదినమూ తగ్గుతూ వస్తోందట. ఈ సిగరెట్లు కాల్చే వారి సంఖ్యా కాల్చువారి సిగరెట్ల సంఖ్యా మన దేశంలో రాన్రానూ దినదినాభివృద్ధి చెందుతోందట— చదూవారీ నీ బ్రాండు ఏమిటి ?

(52 వ పేజీ చూడండి)

# “హెర్క్యులిస్ దృఢత్వానికి కారణం ఏమిటి?

# అందులోవున్న 778 భాగాలన్నింటి గురించి మేము ఎంతో శ్రద్ధ తీసుకోవడమే”

శ్రీ ఏ సుబ్రహ్మణ్యం, సీనియర్ ఇంజనీర్
(ప్రోడక్ట్ డిజైన్ & టెస్టింగ్),
టిఐ సైకిల్స్ ఆఫ్ ఇండియా, మద్రాసు-600 053



సైకిళ్ళ గురించి పూర్తిగా తెలిసినవారిని అడగండి — ఏ సుబ్రహ్మణ్యం వంటి వారిని. సైకిళ్ళ గురించి ఎప్పుడూ ఆలోచనలలో నిమగ్నమయివుండేవారిని. సైకిళ్ళే వారి ప్రపంచం.

హెర్క్యులిస్ గురించి ఉత్తమమయిన విషయాలెన్నో వారు మీకు చెప్తారు. భారతదేశంలో అది ఉత్తమమైన సైకిల్ కావడానికి కారణాలు చెప్తారు తయారు చేసే విధానాలు, అందులో వున్న 778 భాగాలు, (ఔను, 778 భాగాలు వున్నాయి!) పరీక్షలు, నాణ్యత గురించి తీసుకునే శ్రద్ధ

## హెర్క్యులిస్: పరిక్షించడం లోనూ, నాణ్యతా విధానాలు అమలు పెట్టడంలోనూ పూర్తి శ్రద్ధ తీసుకుంటారు.

ప్రతి హెర్క్యులిస్‌కి ముడిపదార్థాలని పరీక్షించడంతో సహా 67 పరీక్షలు విడిగా వేస్తారు

ప్రతి బ్యాచ్ నుంచి ఒక హెర్క్యులిస్‌ని తీసుకుని 'చిత్రహింస' పరీక్ష చేస్తారు— అంటే ఒక వారం రోజులు విరామం లేకుండా తిరిగేటట్లు చూడడం!

రిమ్ములు, ట్యూబ్‌లు మరియు టైర్లు డన్‌లప్ నుంచే కొంటారు (టిఐ సైకిల్స్ శ్రేష్ఠమయినవాటినుంచె కొంటుంది.)

## మీ హెర్క్యులిస్: సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా ప్రత్యేకమైన బాల్ బేరింగ్‌లు

రెండు పూర్తి వరసల హై-క్రోమ్ స్టీల్ బాల్స్ సులభంగా ప్రయాణం చేయడానికి వీలుగా వుంటుంది. మరియు ఎక్కువ బరువులు తీసుకువెళ్ళేటప్పుడు సులభ మయిన ఫ్రీ-వీలింగ్‌కి తోడ్పడతాయి

హెర్క్యులిస్ బాడి హై-బేకెడ్ ఎనామిల్ మరియు హెవీ క్రోమియమ్ ప్లేటింగ్‌లతో తుది మెరుగులు యివ్వబడింది ఫలితం మీ హెర్క్యులిస్ సైకిల్ తన అంద మయిన ఆకారాన్ని సంవత్సరాల తరబడి కాపాడుకుంటుంది






TIC-2238 A




"ఆదివారం లేదు ... సోమవారం లేదు. పండగ లేదు... సెలవలేదు... రోజూ పనే! ఒకొక్కప్పుడనిపిస్తుంది. షెడ్డు కట్టేసి ఎక్కడైనా పారిపోదామా అని. ఇరవైనాలుగ్గంటలూ పనిచేస్తూ కూర్చోడం వల్ల కొట్టు కట్టడమన్నదే మర్చిపోవాల్సొచ్చింది.

షుగర్ ఫ్యాక్టరీకి రోజుకి రెండువందల లారీలొస్తే...., రిపేర్లకోసం కనీసం వాటిల్లో పదైనా నా షెడ్డు ముందు నిల్చుంటాయి. ఒకటి చేస్తూ..చేస్తూ, వదిలేసి మరొకటి ముట్టుకోవడం.. !

'ఎప్పుడౌతుంది...? ఎప్పుడౌతుంది...?' అనే ప్రశ్నలకి జవాబులు చెబుతూ..., 'మాది ముందు... మాది ముందు' అని ముసిరే కస్టమర్లని అభయ హస్తాల్తోటీ, చిరునవ్వుల్తోటీ... పురజేస్తూ పని కానివ్వడం— అంతా యాంత్రికమైన దినచర్య!

చేతుల్నిండా డబ్బే!

అయితే అంతకుమించిన ఒళ్ళుపులుపు!!

సంవత్సరానికి ఆర్నెల్ల హడావిడే అయినా ఊపిరి సలపని పని. ఎంత డబ్బు సంపాదిస్తే మాత్రం ఏం సుఖం? వేళకి తిండి తిన్నేను; కంటినిండా నిద్రుండదు. మంచి గుడ్డలు వేసుకునే యోగం లేనే లేదు. రాత్రింబగళ్ళూ నాకీ గుడ్డలేసుకుని లారీల మీద పనే! కర్మంగాలి ఏ రోజునైనా కాస్త మంచి మంచి బట్టలేసుకుంటే ... అసిస్టెంట్లకి చేతగాని పనే తగిలి ఆ రోజంతా లారీల క్రిందే దేవుళ్ళాడాల్సొస్తుంది.

ఇదంతా డబ్బు కోసమే కాదు;

నే చెయ్యగలిగిన పని వస్తే మాత్రం కాదనడం నా చేతకాని పని కాబట్టి!

చేతి క్రింద పనిముట్లందించే వాళ్ళుగా చేరారు నా వర్క్‌షాపులో కుర్రాళ్ళంతా! షాపుతోపాటు వాళ్ళూ పెరిగి పెద్దాళ్ళయ్యారు చెప్పిన పని చకచకా చేస్తారు. చిన్నప్పుడు తన్నులు తినాల్సొచ్చినా..., ఇప్పటికీ ఏదైనా పొరపాటు చేస్తే గట్టిగా చివాట్లేసినా ఆత్మీయంగ తలొంచేస్తారు గానీ ఎదురు తిరుగు వేషాలెయ్యరు"

దొరికిన కాస్తంత విశ్రాంతిలోనూ పిచ్చాపాటీ కబుర్లు చెబుతూ .. అన్నాడు వర్క్‌షాపు యజమాని వేలుమణి... రిపేరు చేయించుకుంటున్న లారీ ఓనర్‌తో!

"కష్టే ఫలి" నవ్వుతూ జవాబిచ్చాడు లారీ యజమాని!

* * *

వేలుమణి ఎండలో తిరిగొస్తున్నాడు ఎక్కడ్నుంచో! విరిగిన ప్లేటుకి వెల్డింగ్ కోసం వచ్చిన లారీ ఓనర్ వర్క్‌షాపులో పనిచేసే ముసలి మెకానిక్కు మీద అరుస్తున్నాడు. 'పని చేసే కుర్రాడెవడో ఏదో కుంటి సాకు చెప్పంగానే వాడికి సెలవిచ్చి పంపి, తగుదునమ్మా అంటు మధ్యలో చేరావు. చిక్కనపడదు; చెయ్యలేవు అవతల మాకు టైమైపోతోంది కిరాయి కెళ్ళాలి! చెయ్యలేనివాళ్ళు చేరాలొప్పుకోడం ఎందుకో? రానీ మీ ప్రొప్రైటర్ని నిలేసి అడిగేస్తా!'

ఒక్క క్షణంలో అర్థమైపోయింది వేలుమణికి పరిస్థితి!

"ఎన్నిసార్లు చెప్పాలిరా ముసలి ముండా కొడకా! నీకు రాని పన్లు చెయ్యొద్దని. చూడు, వెల్డింగ్ సరిగ్గా అవకపనాగిపోయింది మధ్యలో." గర్జించాడు వేలుమణి.

జాలిగా చూశాడు ముసలి మెకానిక్కు!

"నీకు పని చెయ్యడం రాదు పైగా చేసేవాడికి సెలవిచ్చి పంపే మెహర్బానీ ఒకటా! అదీగాక ఎన్నిసార్లు చెప్పాను

# కలకలలాడే
# ముఖ కళకోసం కలికి కంటికి కాటుక

Shingar
DELUXE
KAJAL

నకిలీవి ఉంటాయి
జాగ్రత్త. కొనేముందు
ప్యాక్‌పై శింగార్ పేరు
చూసి మరీ కొనండి

కాటుక మీ కళ్ళను
అందంగా తీర్చిదిద్దాలిగానీ,
అటూ ఇటూ చెదిరిపోయి కళ్ళ
చుట్టూ వ్యాపించేదయితే ఇక
అందమేముంటుందిమరి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక,
ఆ మామూలు కాటుకలమల్లే చెదిరిపోకుండా
నిలిచి, అందాన్నీ, ఆరోగ్యాన్నీ చాటిచెప్పే
మీ కళ్ళకు సహజమైన, ముగ్ధమనోహర
మైన రూపాన్ని సమకూరుస్తుంది.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుకకు
మీ వేలి కొన తగిలిస్తే చాలు, ఆ వేడికి
కావలసినంత కాటుక మాత్రమే కరిగి
మీ వేలికి అంటుతుంది. ఆ కాటుకను
మీ కనుకొలకులలో రాసుకుని రెండు మూడు
సార్లు వేలితో రుద్దుకుని చూడండి. ఆపైన
మీ కళ్ళలో కోటి వెలుగులు చిందుతాయి.
లక్షలాది భావాలు, భాషలు తొణికిస
లాడతాయి.

శింగార్ డీలక్స్ (కాజల్) కాటుక
మీ కళ్ళకు మేలైనది, సాటిలేనిది పసిపాపల
సున్నితమైన కళ్ళకు అనువైనది.

everest/79/SH/117 tl

## దక్షిణభారతీయ స్త్రీల కళ్ళల్లో
## కోటికాంతులను విరియింపజేసేందుకు

## శింగార్
## డీలక్స్ కాజల్ (కాటుక)

వీళాంటి ముసలాళ్ళెక్కడెందుకూ పనికి రారనీ...పనీ గినీ అంటూ షెడ్డు చుట్టూ తిరగద్దనీ!"

ముసలి మెకానిక్కు మాట్లాడలేదు.

వేలుమణికి కోపం ఎక్కువైపోయింది.

"ని న్నే మా ట్లా డ వే ం...? అసలు నిన్నెవడు చెయ్యమన్నాడిది ?"

ముసలి మెకానిక్కు జవాబివ్వలేదు.

"చేసిన నిర్వాకం చాలుగానీ ... బాబూ వెళ్ళిరా... ఈ రెండొందలూ పుచ్చుకుని. మళ్ళీ పనీ గినీ అంటూ షెడ్డు చుట్టూ తిరక్క—" అతగాడి చేతిలో రెండొందలు పెట్టి పంపించేశాడు.

నిర్లిప్తంగా చూస్తూ వెళ్ళిపోయాడు ముసలి మెకానిక్కు.

"సారీ సొంది సార్! కుర్రోడెటో వెళ్ళిపోవడం వల్ల మీ పని ఆలస్యమైంది. ఐదునిమిషాల్లో నే చేసిపెట్టేస్తాగా" అన్నమర్ని ఓదార్చి కూర్చోపెట్టాడు వేలుమణి. కనీసం బట్టలైనా మార్చుకోకుండా లారీక్రింధకి దూరిపోయాడు!

* * *

"ఎవరబ్బాయ్ నువ్వు? ఏం కావాలి, ఏడుస్తూ కూర్చున్నావు?" అడుగుతున్నాడు పిల్లబళ్ళకి ఇరుసులూ ... ఇనప చక్రాలూ పోసే కార్ఖానా యజమాని గుర్నాధం.

కుర్రోడు జవాబు చెప్పలేదు!

తన పనిలో నిమగ్నమైపోయాడు గుర్నాధం. షుగర్ఫ్యాక్టరీకివచ్చే పిల్లబళ్ళలో కనీసం సగమైనా తన కార్ఖానాలో పని చేయించుకోవాల్సిందే! క్షణం తీరికలేని

# కూర్చునితినరాదూ!

గుర్నాధం... పవంతా అయిపోయిన తరువాత... విశ్రాంతిగా ఒళ్ళు విరుస్తూ... కొట్లోంచి బైటికి రాగానే చూశాడు. ఆ కుర్రోడు అదే బల్లమీద అలాగే కూర్చున్నాడు.

"ఎవరు, ఎవరు బాబూ నువ్వు ?" అడిగాడు మళ్ళీ ఆత్రంగా, ఆప్యాయంగా!

జవాబు చెప్పలేదు కుర్రోడు.

"మూగవాడివా, మాటలు రావా ?"

—అదీ అర్థం కానట్టు చూశాడు కుర్రోడు.

"అన్నం తిన్నావా ?" సైగ చేస్తూ అడిగాడు గుర్నాధం...!

ఆ రోజేకాదు; రెండుమూడు రోజులుగా తిండి తిననట్టు చూశాడు కుర్రోడు.

"అయితే పద, అన్నం పెట్టిస్తా!" బుజంపట్టుకుని తట్టిలేపి తీసికెళ్ళాడు పాక హోటల్కి

కుర్రోడ్ని చూసి చూడంగానే తన వాడిగా గుర్తుపట్టాడు అయ్యర్. అరవంలో గబగబా మాట్లాడేశాడు—

అర్థం కానట్టు ఉండిపోయాడు గుర్నాధం...!

"తల్లినాదిలేసి దేశాంతరం పోయాట్ట, తండ్రి. ఉన్నట్టుండి తలి చచ్చిపోయిందిట దిక్కులేక...రైలెక్కితే... ఊర్లో దించేశారుట." చెప్పాడు అయ్యర్.

'అయ్యోపాపం అన్నాడు' గుర్నాధం ...

"నీ కార్ఖానాలో ఉంచుకుంటావా! కుర్రోడిగా ఉంచుకో— నా హోటలు సంగతి నీకు తెలియంది కాదు. కదా!" అన్నాడు అయ్యర్.

"నా దగ్గరే ఉంటాడ్లే ... చేతిక్రింది పనిచుట్టుందిస్తూ!" అన్నాడు గుర్నాధం.

ఆ తరువాత ఓ నెల్లాళ్ళ తరువాత ఏదో మాటల సందర్భంలో అన్నాడు గుర్నాధం హోటల్ అయ్యర్తో...'వేలుమణి గాడికి అభిమానం ఎక్కువ. కష్టపడి పని చేస్తేగానీ తిండి తినడు!' అని.

అన్నాడు అయ్యర్...!

* * *

రోజులు మారాయి. పిల్లబళ్ళు తగ్గిపోయాయి. తగ్గినదానికి నాలుగురెట్లు లారీలు తయారయ్యాయి — అసాములు భూస్వాములయ్యారు.

'మారే కాలంబట్టే మనమూ మారాలి గానీ... బాధపడుతూ కూర్చుంటే ఏం చెయ్యగలం...? ఇరుసులూ... చక్రాలూ చేసే పనులు తగ్గిపోయినా దిగులుపడకు. రాత్రిళ్ళు పనిచేసే లారీల పక్కషెడ్లో నేను నేర్చుకున్న పని వృధాపోదు. నేనూ లారీలు బాగుచేస్తానుగా...!' అలా అభయహస్తం ఇవ్వడం కాదు; గుర్నాధం కార్ఖానాని లారీ వర్క్షాపు చేసేశాడు ఓ ఐదేళ్ళకి — క్షణం తీరికలేని మనిషయ్యాడు...వేలుమణి!

* * *

"కూర్చుంటావా, ఇవ పెట్టెముందు కూర్చో- పెత్తనం చెలాయించు! అంతేగానీ పని చేస్తాను, పనిముట్లందిస్తాను అంటూ షెడ్లోకి వస్తావా ... ఈసారి నిజంగానే గెంటేస్తాను..." చిరుకోపంతో అదిలాడు వేలుమణి ... భోజనం చెయ్యకుండా కూర్చున్న గుర్నాధాన్ని.

"కష్టపడందే తిండి తినడం అన్నది నీకు తెలిస్తే... దేశాన్ని పిల్లబండి కార్ఖానా లేకపోతే నీ, నువ్వూ నేనూ చచ్చిపోయుండేవాళ్ళం కదరా మణీ! నువ్వందాక ఇచ్చిన రెండొందలూ రోజువారీ జమకట్టేగ్గిన బ్యాంకి సేవింగ్స్ ఎకౌంట్లో కట్టేశాను—" అన్నాడు గుర్నాధం.

ఇంక ఏం మాట్లాడాలో తెలీక అన్నాడు వేలుమణి...'నీతో వాదించడం నావల్లకాదు గానీ ..., పద, పద భోజనం చేద్దాం' అని—



# వేసవి చిట పటలు!




కారం వెయ్యలేదు! మంచినీళ్ళు తక్కువగా వున్నాయని...


అమ్మగారూ.. బొండాలు.


ఎంత హాయి ...... వెన్నెలరేయి! ......


పక్కింటికెళ్ళి ఫ్రిజ్‌లో నీళ్ళు అడుగు...


ఈకాలంలో వెధవ జుట్టు మహాచిరాకు!


నేను ఆ చెట్టుకింద పడుక్కుంటా! కెరెంటు రాగానే పిలువు....

గీత—

సీరియల్ [illegible] అనుబంధం

జొంగుంటల రామచంద్రమూర్తి

4

(గత సంచిక తరువాయి)

"గోపాలం ?"

భానుమూర్తి పిలుపు విని గదిలోంచి బయటకు వచ్చాడు గోపాలం.

"నీతో మాట్లాడాలి! అలా కాలువ గట్టుకి పోదాం!" —

ఎందుకూ, ఏమిటీ అని ప్రశ్నించకుండానే, గోపాలం భానుమూర్తిని అనుసరించాడు.

ఇద్దరూ చెరకు తోటకు చేరుకున్నారు.

"నువ్ నాకో సహాయం చేయాలి!"— ఎత్తుగావున్న గట్టుమీద రుమాలు పరచుకుని కూర్చుంటూ అడిగాడు.

"ఏమిటీ?" అన్నట్లు చూశాడు గోపాలం.

"ఓసారి కృష్ణాష్టమి పండక్కి అమ్మతో నేనూ మన గుడికి వచ్చాను. అప్పుడు అమ్మ మీ నాన్నగార్ని అడిగింది — 'మన గోపాలస్వామికి వెండి కిరీటం చేయించాలని వుంది ఆచార్లుగారూ — ఏ మాత్రం అవుతుందేమిటీ' — అని!... మీ నాన్నగారు ఏదో చెప్పారు. ఏం చెప్పారో నాకు తెలియదు కానీ, అమ్మమాత్రం దేవుడికి కిరీటం చేయించకుండానే వెళ్ళిపోయింది." — చెప్పటం ఆపి, నిర్మలంగా కనిపిస్తున్న ఆకాశం వైపు చూశాడు.

అతను చెప్పబోయేదేమిటో అర్థంచేసుకునేందుకు ప్రయత్నిస్తున్నాడు గోపాలం.

అంతలో, పేంటు జేబులోంచి డబ్బు తీసి — గోపాలం చేతిలో పెడుతూ —

"ఈ డబ్బు వుంచు... దీంతో మన వేణుగోపాలస్వామికి వెండి కిరీటం చేయించి రాబోయే కృష్ణాష్టమికి, అమ్మ పేరుమీదుగా అలంకరించు... నేను మళ్ళీ వస్తానో రానో!" — అన్నాడు భానుమూర్తి.

తల్లిపట్ల అతనికి వున్న ప్రేమాభిమానాలకు తన్మయుడయ్యాడు గోపాలం.

"మీ అమ్మంటే నీకు చాలా అభిమానం!"— అన్నాడు.

"నిజమే! అమ్మ విలువ ఏమిటో — అమ్మ పోయిన తర్వాతనే తెలుసుకున్నాను. అమ్మే బ్రతికివుంటే — నేనివాళ ఇలావుండేవాడ్నికాదు గోపాలం!" — భానుమూర్తి కళ్ళల్లో నీళ్లు సుళ్లు తిరుగుతున్నాయి.

"మరీ చిన్నపిల్లాడిలా ఏమిటిది భానూ! అయినా ఇప్పుడు నీకేం లోటు వచ్చింది...

**జరిగిన కథ – 2 :** చిన్నతనంలోనే తన తల్లిదండ్రులను కోల్పోయి, ఉన్న వూరు వదలి హైద్రాబాద్‌లో తన అక్క దగ్గరుంటున్న భానుమూర్తి, ఇల్లు అమ్మకం విషయంమీద తిరిగి ఆ వూరు వస్తాడు. అక్కడి ప్రదేశాలను చూస్తుంటే అతనికి గతస్మృతులు జ్ఞప్తికి వస్తూంటాయి. భానుమూర్తిని కరణంగారి అమ్మాయి సుధ పెళ్ళి చేసుకోమని అడుగగా, తనకా అర్హత కలిగినప్పుడు తప్పకుండా చేసుకొంటానని సమాధానమిస్తాడు.

హాయిగా హైదరాబాదులో వుంటున్నావ్... బి ఏ చదువుకున్నావ్... రేపో మాపో పెళ్లి చేసుకుంటావ్, ఇల్లు కట్టుకుంటావ్"—

గోపాలం మాటలు విని విరక్తిగా నవ్వుకున్నాడు భానుమూర్తి.

మరికొన్ని నిముషాల తర్వాత— గోపాలాన్ని మళ్లీ ఇంటి దగ్గర దిగవిడిచి, తాను మాధవరావ్ మాస్టారింటికి చేరుకున్నాడు.

"ఈ రాత్రి బయల్దేరి హైదరాబాద్ వెళ్ళిపోతున్నాను మాస్టారూ!" అన్నాడు.

"వచ్చిన పని అయిందా బాబూ ?"— అని అడగాలనుకున్న మాధవరావు గారు — భానుమూర్తి కళ్లల్లో కదులుతున్న భావాల్ని అర్థం చేసుకుని —"ఎప్పుడైనా వస్తూండు బాబూ" — అని మాత్రం అన్నారు.

"మీరేమీ అనుకోనంటే ఓ విషయం చెప్తాను" —

"ఏమిటి భానూ ?"

"సీత పెళ్లి నేనే చేద్దామని అనుకున్నాను. కానీ నేను మళ్లీ ఈవూరు రాగలనో లేదో, ఈ డబ్బు మీ దగ్గర వుంచండి"— బరువుగావున్న ఓ కవరు తీసి మాధవరావుగారి మంచంమీద పెట్టాడు.

ఊహించని సంఘటనకు త్రుళ్లిపడ్డారాయన...

"సీత పెళ్లికోసం నువ్ డబ్బిస్తున్నావా ?" — అన్నారు 'నువ్వు' అనే మాటను ఒత్తి పలుకుతూ.

"అవును మాస్టారూ!... విశ్వమే బ్రతికుంటే — చెల్లెలి పెళ్లి చేయటం అతని బాధ్యతకాదూ ?"—అని భానుమూర్తి అంటూంటే అతని కళ్లల్లోకి పరిశీలనగా చూసిన మేస్టారికి విశ్వమే కనిపించాడు... అదే సమయంలో ఆయన కళ్ళల్లోకి చూసిన భానుమూర్తికి, ఆవేదనో, ఆత్మీయతో కనిపించింది.

అది భరించలేక —

"ఇక వెడతాను మాస్టారూ!" — అంటూ లేచాడు.

"వెళ్లిరా బాబూ! నిన్ను భగవంతుడు చల్లగా చూస్తాడు" — అస్పష్టంగానే ఆశీర్వదించారాయన.

వీధిలోకి వచ్చిన భానుమూర్తి బరువుగా నిట్టూర్చాడు.

చుట్టూ చీకటి ఛాయలు అప్పుడప్పుడే చిక్కపడుతున్నాయి...

ఆ చీకటిలో నిలబడి — మాస్టారి [illegible]

లను తలచుకుంటూ మరోసారి విరక్తిగా వ్వుకున్నాడు...

"భగవంతుడు తనను చల్లగా చూస్తాడు" —

ఎప్పుడో...? ఇంకెప్పుడో? ...

"బంధాలు మూణ్ణాళ్ళ... అనుభూతి చావ్వాళ్ళ" —

దూరంనుంచి తాత పాడుతున్న తత్వం లీలగా గాలి తరంగాలతో కలసి వినిపిస్తున్నట్టు అనిపించింది భానుమూర్తికి.

భారంగా అడుగులు వేస్తూ ముందుకు నడిచాడు ...

## 5

హైదరాబాదు తిరిగి వచ్చిన భానుమూర్తి - రజాక్ ఇంటికి చేరుకుని తలుపు తట్టాడు... రజాక్ తల్లి తలుపు తీసింది...

"రజాక్ ఇంకా నిద్ర లేవలేదా?" — లోపలకు వస్తూ అడిగాడు.

"ఇంట్లో లేడు బాబూ... రాత్రనగా వెళ్లాడు!" —

రజాక్ అంటే భానుమూర్తికి చాలా ఇష్టం... వాళ్ళిద్దరూ చాలాకాలం కలసి చదువుకున్నారు... ముస్లింలే అయినా, వాళ్ళ తెలుగు బాగా మాట్లాడుతారు...

రజాక్ తల్లి చాంద్‌బీబీ భానుమూర్తిని ఎంతగానో అభిమానిస్తుంది.

"మీ వూరు పోయినావని రజాక్ చెప్పాడు! ఎప్పుడొచ్చావ్ బేటా?" — అడిగింది చాంద్‌బీబీ — భానుమూర్తి లోపలకు రాగానే...

"ఇప్పుడే వస్తున్నాను... ఇంకా ఇంటికి పోలేదు -"

సమాధానం చెప్పి — బట్టలు మార్చుకుని — ముఖం కడుక్కునేటందుకు 'బాత్‌రూం'కి వెళ్లాడు. తిరిగి వచ్చేసరికి ఆమె టీ తీసుకొచ్చింది... టీ త్రాగిన తరువాత, అక్కడే వున్న మంచంమీద పడుకుని కళ్ళుమూసుకున్నాడు.

రాత్రంతా బస్సు ప్రయాణంలో చాలా అలసట కలిగింది... దానికితోడు భోజనం కూడా చేయలేదు. ఆ నీరసం వల్ల పడుకున్న వెంటనే నిద్ర పట్టేసింది.

మధ్యాహ్నం రెండు గంటల వేళ, రజాక్ తట్టి లేపితేనే గానీ మెలుకువ రాలేదు భానుమూర్తికి.

"పొద్దున్న వచ్చావుటగా... అమ్మ చెప్పింది!" —

అవునన్నట్టుగా తల పంకించాడు.

"వేణ్ణీళ్ళు పెట్టించాను...వెళ్ళి స్నానం చేసిరా... బడలిక తగ్గుతుంది. భోజనం చేద్దాం!" — అన్నాడు రజాక్.

అప్పుడు గానీ తనకు ఆకలిగా వున్న విషయం గుర్తుకు రాలేదు భానుమూర్తికి.

"రాత్రవగా వెళ్ళావుట..ఎప్పుడొచ్చావ్?" అని అడగాలనుకున్నాడు భానుమూర్తి. గానీ అడగలేదు..

రాత్రిళ్ళు అలా ఇంటికి రాని రోజున రజాక్ ఎక్కడ వుండేది తెలుసు కనక వూరుకున్నాడు...

"ఇంతసేపు నిద్రపోయావ్... రాత్రి ప్రయాణంలో నిద్రలేదా?" — రజాక్ అడిగాడు, స్నానం చేసివచ్చిన భానుమూర్తిని.

అప్పటికే అక్కడి బల్లమీద వేడి వేడి రొట్టెలు సిద్ధంగా వున్నాయి

రొట్టెల ప్లేటును చేతిలోకి తీసుకుంటూ — రజాక్ వైపు చూశాడు భానుమూర్తి...

"ఓహ్! నాలుగు రోజుల నుంచి నీ గొంతు ఎండి పోయిందనుకుంటాను... ఆగు... ఇప్పుడే వస్తాను" — అంటూ లేచివెళ్ళి మూలనున్న సూట్‌కేసు తెరచి అందులోంచి ఓ విస్కీబాటిల్ తెచ్చాడు రజాక్.

రెండు గ్లాసుల్లో పోసి, దాని నిండా నీళ్ళు నింపి, ఓ గ్లాసు భానుమూర్తి కిచ్చి, తానుకూడా ఆ మంచం మీదనే కూర్చున్నాడు.

"వెళ్ళిన పని అయిందా?" అడిగాడు రజాక్...

"అయిపోయింది. మా ఊరికీ నాకూ ఋణం తీరిపోయింది బ్రదర్" — గట గటా గ్లాసులోని విస్కీనంతా రెండు గుక్కల్లో తాగేశాడు భానుమూర్తి.

"ఏంటి నాలుగు రోజులు తాగక పోతే మాత్రం — గ్లాసులో వున్నదంతా ఒక్కసారే తాగేస్తే ఎలా?" అంటూ మళ్ళీ ఆ గ్లాసులో విస్కీపోశాడు రజాక్.

"లేదు బ్రదర్!... నాలుగు రోజులే కాదు...ఆ వూళ్ళోవుంటే నాలుగు యుగాలయినా ఇలాంటివి గుర్తుకురావు...అక్కడకు వెళ్ళగానే నాకు ఏమనిపించిందో తెలుసా?... అక్కడిగాలీ, నీరూ, నేలా అన్నీ ఎంతో పవిత్రంగానూ, రమ్యంగానూ వున్నట్లని పించింది. ప్రశాంతంగా వున్న ప్రకృతిలో— ఎంతో ఎత్తైన కొండమీద వున్న ఓ చిన్న దేవాలయానికి వెళ్ళినంత హాయిగా అని పించింది...ఎక్కడెక్కడి అమర లోకాలకో తేలిపోతున్నట్లు అనిపించింది... బంధాలూ, అనుబంధాలూ, అడుగడుక్కీ వెనవేసుక పోతూంటే — వాటన్నింటినీ, బలవంతంగా త్రెంచుకుని రాలేకపోయాను".

ఖాళీగ్లాసు మళ్ళీ రజాక్ ముందుకు తోశాడు.

"చాలు భాయ్! ఇంకొద్దు!... అయినా నువ్ ఇంటికి వెళ్ళవా?"—

"వెళ్తాను.. అక్కమాట ఎలావున్నా — నా కోసం బావ ఎదురు చూస్తుంటాడు!... కానీ వూర్నించి రాగానే ముందు నిన్ను కలుసు కోవాలని అనిపించింది... అంతే!... వచ్చేశాను..." మంచంమీద వెనక్కివాలి, రెండు చేతులూ మెడక్రింద పెట్టుకుని కళ్ళుమూసుకున్నాడు భానుమూర్తి.

ఖాళీ అయిన గ్లాసుల్నీ — ప్లేట్లనీ లోపలపెట్టి — మళ్ళీవచ్చి కూర్చున్నాడు రజాక్...

## అనుభూతి – అనుబంధం

"సుందరం కనిపించాడా నీకు?" — కళ్ళు మూసుకునే అడిగాడు భానుమూర్తి.

"కనిపించాడు! నువ్ ఎప్పుడు వస్తావని అడిగాడు!" —

భానుమూర్తి లేచి కూర్చుని, తన సంచీలోనుంచి డబ్బు తీశాడు...

"ఈ డబ్బు తీసుకెళ్ళి సుందరానికిచ్చేయ్!.. నేను రాత్రికి ఇంటికి వెళ్ళి, మళ్ళీ రేపు నిన్ను కలుస్తాను" — అంటూ అయిదు వంద కాగితాలు తీసి రజాక్ చేతిలో పెట్టాడు...

రజాక్ బదులు చెప్పకుండా వాటిని తీసుకుని జేబులో పెట్టుకున్నాడు...

ఆ రాత్రి, భానుమూర్తి ఇంటికి చేరుకునే సరికి తొమ్మిది గంటలయింది.. అప్పటికి రాజారాం ఇంకా ఇంటికి రాలేదు... అక్కయ్యతో ఏమీ మాట్లాడకుండానే — తన గదిలోకి వెళ్ళిపోయాడు...

కొంతసేపటికి రాజారాం ఇంటికి వచ్చాడు...

"భానూ ఇవాళ కూడా రాలేదా?" బట్టలు మార్చుకుంటూ అడిగాడు.

"ఊళ్ళోకి ఎప్పుడొచ్చాడో తెలియదు కానీ— ఇంటికి ఇంతకు ముందే వచ్చాడు..."

"భోజనం చేశాడా?" మళ్ళీ అడిగాడు రాజారాం.

అక్కాబావల సంభాషణ భానుమూర్తికి వినిపిస్తూనేవుంది. బావ ఇంటికి రాగానే అక్కయ్యను అడిగే ప్రశ్నే అది!... ఆ ఆప్యాయతే తనను ఇంటిలో అలా కట్టివేసింది. లేకపోతే తనకంటూ ఓ వునికి ఎక్కడిది? తానొక తెగిపోయిన గాలిపటం...

తన ప్రవర్తన ఎలాంటిదో అక్కయ్యకు తెలుసు!... అందుకే అక్కయ్య తనను ద్వేషిస్తుందేమో కూడా!...కానీ అక్కయ్యలో తాను అమ్మను చూసుకుంటున్నాడు... తప్పుడు పనులు చేస్తున్నాడు కనుకనే, అమ్మలాంటి అక్కముందు నిలబడటానికి సాహసించ లేకపోతున్నాడు. అక్కయ్యను తప్పించుకుని తిరగాలనుకుంటున్నాడు. రెండు రోజుల కొకసారైనా తాను ఇంటికి వస్తున్నాడంటే — కేవలం బావగారి ఆదరణ కోసం, ఆప్యాయత కోసం!... అంతే!!

హాల్లోంచి ఇంకా మాటలు వినిపిస్తూనే వున్నాయి.

"ఇంటి సంగతి ఏమైనా చెప్పాడా?" బావ ప్రశ్న.

"చెప్పే స్థితిలో వుంటేగా? బహుశా ఇల్లు అమ్మకం అయిపోయే వుంటుంది. వచ్చిన డబ్బుకూడా ఖర్చయి పోయిందేమో? లేకపోతే ఇంటికి ఎందుకు వస్తాడూ?" — అక్కయ్య మాటల్లో కోపంతో బాటు వేదన కూడా వినిపించింది.

"పోన్లేద్దూ..! అది వాడి డబ్బు... వాడిష్టమొచ్చినట్టు చేసుకుంటాడు."

"అలా గారం చేసే, వాణ్ణి ఇవాళ ఈ స్థితికి తెచ్చారు మీరు... లేకపోతే ఈ వయసులో వాడికి ఆ తిరుగుళ్ళేమిటి? ఈ అలవాట్లేమిటి? అయినా నేను ఏనాడో చెప్పాను, 'మన వాళ్ళ మనకు చాలక పీడుకూడా మనకెందుకండీ' అని!... విన్నారుకాదు..."

"జానకీ! అలా మాట్లాడవద్దని నీకు లక్షసార్లు చెప్పాను. అయినా మీ ముగ్గురికీ వాడు ఒక్కడే తమ్ముడు! ఎవరో ఒకరు వాడి బాధ్యతను తీసుకోవాల్సిందేగా?"

"అదే నేనూ అంటున్నాను... తక్కిన వాళ్ళిద్దరికీలేని బాధ్యత మనకు మాత్రం ఎందుకూ అని!"

"ఎలాగా పిల్లలు కలవాళ్ళం... మన పిల్లలతో బాటే వుంటున్నాడుగా?" — నచ్చచెప్పే ధోరణిలో వున్నాయి బావ మాటలు...

"అలా అనుకునే తెచ్చి నెత్తిన పెట్టుకున్నాం.. ఇప్పుడేమో ఇంట్లో నా పరువూ— వీధిలో మీ పరువూ తీసేస్తున్నాడు"—

"మనుషులుఎప్పుడూ ఒక్కలాగేవుండరు

## నాన్నారి కారు నేనే రిపేర్ చేసేశా.



టింకూలాంటి బాబు మీకు ఉన్నప్పుడు మురికి బట్టలు ఒక నిత్య సమస్య. అయినా పరవాలేదు. రీగల్ యిచ్చే శక్తివంతమైన నురుగు ఎంతటి మురికినైనా మటుమాయం చేస్తుంది.




రీగల్‌కు గల అధిక నురుగునిచ్చే శక్తి బట్టలలోనికి చొచ్చుకొనిపోయి ఎంతటి మురికినైనా తొలగిస్తుంది. రీగల్‌కు గల అధిక తెల్లదనాన్నిచ్చే శక్తి మీ బట్టలను తళతళలాడే తెలుపుతోను, వెలుగుతోను మెరిసేలా చేస్తుంది. రీగల్‌కు గల పొదుపు శక్తి ఏ యితర డిటర్జెంట్ సబ్బుకన్న ఎక్కువ ఉతుకులు యిస్తుంది. రీగల్‌ను మీ కుటుంబపు డిటర్జెంట్ సబ్బుగా చేసుకోండి.

# రీగల్

**ఇండియాలో అత్యధిక శక్తిగల డిటర్జెంట్ బట్టల సబ్బు**

Rediffusion/DIL/1002 TL

నీకేమే! లాస్ట్ బెంచిలో కూచుంటావ్ గా హాయిగా — నవలన్నా చదువుకుంటావ్... నాదేమో ఎప్పుడూ మొదటి బెంచి. ఉపాధ్యాయులు చెబుతున్న పాఠాలు చెవుల్లో రొద చేస్తుంటే ఇక నవల్లేం బుర్రకెక్కుతాయ్ నా మొహం!!

జానకి వాడికి ఓ ఉద్యోగం దొరికి — ఓ ఇంటివాడయితే — దారిలో పడతాడు... అయినా ఒకరి జీవితాన్ని మరొకరు నిర్దేశించలేరు!... ఎవరి బతుకులు ఎలా సాగిపోవాలో అలా సాగిపోక తప్పదు'' —

ఆ మాటలు వింటున్న భానుమూర్తికి నవ్వొచ్చింది.

నిజమే! జరగాల్సింది జరక్క మానదు...

కొందరు అదృష్టవంతులకు అనుకున్నవన్నీ — అనుకున్నట్టే జరిగిపోతాయి. అందుకే వాళ్ళు అదృష్టవంతులు. పైగా తమ ప్రతిభవల్లనే అలా అనుకున్నవన్నీ జరిగిపోతున్నాయనుకుంటారు. ఎంతటి అమాయకులు వాళ్ళు?... అలాంటివాళ్ళను ఎప్పటికైనా దురదృష్టమనే అగాధపు లోతుల్లోకి త్రోసేసి - నిస్సహాయంగా పైకి చూసేలా చేసుకుంటాడు పైనున్నవాడు — ఆ భగవంతుడు...!

మరి తానిప్పుడు అగాధపు నూతిలో ఎన్నో మెట్టుమీద వున్నాడు?

తన జీవితాన్ని భగవంతుడు ఎందుకిలా నిర్దేశించాడు? అసలు ఎవరి జీవితాల్ని వాళ్ళే ఎందుకు నిర్దేశించుకోలేకపోతున్నారు?

తాను, అందమైన పల్లెటూళ్ళో — రమ్యమైన పొదరింట్లో — ముగ్గురు ఆడపిల్లల తర్వాత — ఎన్నో నోముల పంటగా పుట్టాడు... అర్థం ఆకారం లేకుండా

## అనుభూతి - అనుబంధం

మాట్లాడుతుంటే — ఆ మాటలకు అమ్మ భాషనేర్పింది. తాను తప్పటడుగులు వేసినప్పుడు — తనచేతిని ఊతగా ఇచ్చి — ఆ అడుగులకు వడక నేర్పాడు నాన్న...

అలాంటి నాన్న కాళ్ళూ చేతుల్నీ పడేకేసి కట్టేస్తూంటే కన్నీటి పొరల్లోంచి నిస్సహాయంగా చూస్తూ వుండి పోయాడే తప్ప తానేం చేయగలగాడు...?

ఆ తరువాత ఏడాదైనా తిరక్కుండానే అమ్మ...!

బహుశా తన పుట్టుక కోసం కలవరించినంత కాలమైనా వాళ్ళిద్దరూ బ్రతకలేదు.

అదే తన దురదృష్టం...

అప్పటినుంచీ తనకు మరో జీవితం ప్రారంభమయింది.

'తన బాధ్యతను ఎవరు తీసుకోవాలా' — అని అక్కయ్యలు ముగ్గురూ ఎవరికి వారు అప్పుడు తర్జన భర్జనలు చేసుకున్నారు.

తనకిప్పటికీ గుర్తుంది...

అమ్మపోయిన పధ్నాలుగో రోజు...

''భానూ మనతోపాటే వస్తాడు జానకీ!''—అన్నాడు పెద్దబావ రాజారాం...

అర్థంకాక, అయోమయంగా చూసింది జానకి... తక్కిన బావలు ఏమీ మాట్లాడలేదు. ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు...

''మన పిల్లలతోబాటే వుంటాడు. మన రామంతోటే చదువుకుంటాడు'' — మళ్ళీ అన్నాడు రాజారాం.

''వున్న నలుగురితోటే చేసుకోవటం కష్టంగా వుంటోంది... పోనీ కొంతకాలం మా చెల్లెళ్ళ దగ్గర వుంచుదాం'' — అంది జానకి.

అప్పటికే — తక్కిన అక్కయ్యలిద్దరూ ఔననికానీ, కాదనికానీ అనలేదు.

''ఒకళ్ళిద్దరు పిల్లలున్నవాళ్ళకీ — అసలు పిల్లలు లేనివాళ్ళకీ కష్టం కావచ్చు. కానీ మనకు నలుగురున్నారు. కష్టం సుఖం తెలిసినవాళ్ళం!... మనకి అయిదుగురు పిల్లలనుకుందాం... అయినా ఈ ఇంటికి నువ్వే పెద్దకొడుకువై వుంటే—వాడి బాధ్యత నీదికాదూ?'' — రాజారాం మాటలకు జానకి మరేమీ బదులు చెప్పలేదు.

ఆ మర్నాడే తాను వాళ్ళతో హైదరాబాద్ వచ్చేశాడు.

అప్పటినుంచీ — తనకు తెలియకుండానే— ఎందుకో అక్కయ్యంటే భయపడుతున్నాడు. తనను వుంచుకోవటానికి విముఖత చూపించినందువల్లనే అక్కయ్యంటే తనకు అలాంటి భయం ఏర్పడివుండచ్చు.

అయితేనేం...?

బావ మాత్రం తనపట్ల ఎంతో శ్రద్ధ చూపించేవాడు. తన పిల్లలతోటే బట్టలు కుట్టించాడు. చదువు చెప్పించాడు. ఒకొక్కసారి తన పిల్లలకు లేదని చెప్పి — తనకు డబ్బులిచ్చేవాడు. అడిగిందల్లా కొనిపెట్టేవాడు.

''వాడ్ని గారంచేసి పాడుచేస్తున్నారు. బళ్ళో సరిగా చదవటంలేదట... వాడి స్నేహితులు చెబుతున్నారు'' — అని ఒకటి రెండుసార్లు అక్కయ్య ఫిర్యాదు చేస్తే—

''మన పిల్లలకు నువ్వూ నేనూ వున్నాం. చాలు జానకీ!...కానీ భానూకి ఆ అదృష్టం లేదు. అందుకే వాడికి ఏ లోటూ రానీయకూడదు'' — అనేవాడు రాజారాం.

అన్నట్టుగానే తనను 'ఇంత' వాడ్ని చేశాడు.

అడిగినప్పుడల్లా డబ్బులిచ్చాడు. తను బడిమానేసి మాట్నీలకు వెళ్ళినా ఆదేమని అడిగేవాడు కాదు. అవసరం వచ్చినప్పుడూ, ఆ అవసరాన్ని తీర్చుకునేటందుకు బావను అడగటానికి అభిమానం లాంటిది అడ్డు వచ్చినప్పుడూ — సినిమాహాలు దగ్గర 'బ్లాకు'లో టిక్కట్లు అమ్మి డబ్బు సంపాదించుకుంటే — ఆ విషయం తెలిసిన బావ, ఆఖరికి అది తప్పని కూడా అనలేదు.

ఒకసారి స్నేహితులతో — పార్టీ పేరు చెప్పి — తప్పతాగి ఇంటికొస్తే — 'తాగుడు తప్పనాన్నా' అంటూ మెత్తగానే మందలించాడు. కాని, చెప్పుతో ఒక్కదెబ్బ కొట్టి వుంటే — తన జీవితం మరో మంచి మలుపు తిరిగి వుండేదేమో?

కానీ...

అలా జరిగివుంటే — అక్కయ్యకు భయపడుతున్నట్లే — తాను బావకూ ఇప్పుడు భయపడుతూ వుండేవాడేమో?

ఆకలి వేసినప్పుడు అన్నం తినాలని తనకూ తెలుసు!

అయినా బావ అక్కని అడుగుతూంటాడు—

''భానూ భోజనం చేశాడా?'' — అని.

/ఇంకా వుంది/



'ఆపద్బాంధవులు'లో శారద



'మరో ప్రేమ కథ'లో సుజాత

# సినిమా విశేషాలు

—జి.వి.జి

## ఇల్లే స్వర్గం ఇల్లాలికి వందనం

రజని (మాధవి) అలమారు తీసి, కప్పులు, వస్తువులు చూస్తోంది లోపలికి వచ్చిన రాము (చంద్రమోహన్) ఆశ్చర్యపోయాడు. "ఎప్పుడొచ్చావ్? ఇన్నాళ్ళున్నావ్ — ఉత్తరమైనా రాయలేదే?"

"ఏమండీ! నేనెందుకు రాలేదా అని ఆలోచిస్తున్నారు కదూ? మీరిక్కడ ఎలా ఉండగలుగుతున్నారా అని ఆలోచిస్తున్నాను నిజమండీ పొద్దున్నే లేచి పడుకోబోయే వరకు ఏం చేశామో, ఏం చూశామో — నిన్నా అదే, రేపూ అదే ప్రతి రోజూ, బతికున్నన్నాళ్ళూ అంతే! జీవితంలో కొత్తేముంది? మార్పేముంటుంది? గానుగెద్దులాంటి జీవితం ఇదే సిటీలో అయితే, నిన్నలా ఈ రోజు ఉండదు రేపిలా కనిపించదు నిత్య నూతనం ప్రతి దాంట్లో మార్పు! ఎవరెవరి ఇష్టాలకి, అభిరుచులకి అనుగుణంగా, స్వేచ్ఛగా అభివృద్ధి కావటానికి అనుకూలమైన వాతావరణం... చూడండి! మనం అక్కడికి ఎందుకెళ్ళకూడదు? ఆ అవకాశాలు ఎందుకు వినియోగించుకో కూడదు? ఇక్కడ ఏముందండీ? నూతిలో నీళ్ళలాగ, అందులో కప్పల్లాగ — చలనం లేని జీవితాలు. ఇక్కడ కార్లా, షికార్లా? సినిమాలా? ఆటా పాటా — కనీసం మంచి రోడ్డు కూడా లేదు దేనికండీ ఇక్కడ? ఇక్కడేముంది?"

"అవేవీ లేవు, రజనీ! కాని, నిత్యం నన్ను పలకరించే పశువులున్నాయి పులకరింప జేసే పొలాలున్నాయి అమ్మఉంది నాన్నున్నాడు అమ్మలా చూసుకునే వదిన ఉంది నా ఆరో ప్రాణం బేబి ఉన్నాడు వాళ్ళ ఆదరణ, ప్రేమ, ఆప్యాయత ఉన్నాయి అంతకంటే నాకేం అక్కర్లేదు అవన్నీ వదిలి పెట్టి రాలేను, రాము"

"ఈయన్ని చూసి పశువులు పలకరిస్తాయ్! పొలాలు పులకరిస్తాయ్! మనుషులు కాదు!"' అంటూ బరువుగా నిశ్వాస వదిలింది రజని

గార సత్యనారాయణమూర్తి బి యె (లిట్) దర్శకత్వంలో వేంద్రపు శంకరరావు, నెరుసు సూర్యనారాయణ సమర్పించే నటరాజా ఆర్ట్ క్రియేషన్స్ "ఇల్లే స్వర్గం" చిత్రానికి డాక్టర్ చీకటి ఆంజనేయులు, దాసరి గోపాలకృష్ణ, శంభంగి అప్పారావు నిర్మాతలు నిర్వహణ అడుసుమిల్లి వెంకటేశ్వరరావు

## అగ్నిపూలు

తను కార్యాలయంమీద అత్యాధునికంగా నిర్మించిన "సురేష్ మహల్" ప్రీవ్యూ థియేటర్‌ను నిర్మాత డి రామానాయుడు చూపించారు 40 సీట్లు ఉన్న ఎ సి — డీలక్స్ థియేటర్. సురేష్ ప్రొడక్షన్స్ చిత్రాల గురించి వివరిస్తూ, "బందిష్' — పూర్తయింది ఆగస్టులో విడుదల చేస్తున్నాం. హిందీలో 'మండే గుండెలు' అక్టోబర్‌లో మొదలెడుతున్నాం రాజేష్‌ఖన్నా, జితేంద్ర ఉంటారు. కె బాపయ్య డైరెక్టరు. ఆగస్టులో 'అగ్నిపూలు' సెట్స్‌కు వెళ్తుంది కృష్ణంరాజు, జయప్రద, జయసుధ, సత్యనారాయణ, అల్లు రామలింగయ్య — ఇంతవరకు అనుకున్నాం జంధ్యాల రైటరు. మహదేవన్, విన్సెంట్, మార్తాండ్, ఎస్ కృష్ణారావు టెక్నీషియన్‌లు బాపయ్యే డైరెక్టరు," అన్నారు రామానాయుడు

## "జగమొండి"

శోభన్‌బాబు హీరోగా వి. మధుసూదనరావు దర్శకత్వంలో కె ఛటర్జీ నిర్మించే సమతా మూవీస్ వారి పై చిత్రం తొలి షెడ్యూల్ పూర్తయింది. రతి నాయిక సత్యనారాయణ, ప్రభాకరరెడ్డి, రాజ్యలక్ష్మి (శంకరాభరణం), జానకి, రాజ్‌బాబు, పి ఎల్ నారాయణ, సుంకరలక్ష్మి, మాస్టర్ క్రాంతి తక్కిన ముఖ్య భూమికలు నిర్వహిస్తున్నారు. ఎమ్వీయల్, చక్రవర్తి, వెంకట్, అంకిరెడ్డి వగైరా సాంకేతికవర్గంతో పి. రామమోహనరావు ప్రొడక్షన్ కంట్రోలర్

## వి మధుసూదనరావు దర్శకత్వంలో కొత్త చిత్రాలు

తిలక్ నిర్మించే నీలిమా ప్రొడక్షన్స్ చిత్రంలో శోభన్‌బాబు, జయసుధ నాయకా నాయికలు

అల్లు నిర్మించే గీతా క్రియేషన్స్ చిత్రంలో మురళీమోహన్ హీరో.

# ప్రియని చూస్తే చాలు... మా మామగారు తన వయసే మరచిపోతారు!



ఒకరోజు గోంగూర పచ్చడి ఇంటికి తెచ్చాను. దాన్ని చూసీ చూడగానే మా మామగారి మొహంలో ఆనందపరవశాలు తొణికిసలాడాయి. మరుక్షణంలో సీసా మూత తీశారు. ఒక పెద్ద చెమ్చాడు పచ్చడి వడ్డించుకున్నారు. యౌవనోత్సాహంతో రెండు చపాతీలను ఆరగించారు. ఇంత ఇష్టంగా ఆయన భోజనం చెయ్యడం నేనెప్పుడూ చూడలేదు. పచ్చళ్ళ గురించి నేనిక కంగారుపడనవసరం లేదు. 'ప్రియ' పచ్చళ్లు నాణ్యతకు ప్రతిబింబాలు. అధునాతన ఫ్యాక్టరీలో, పరిశుభ్రమయిన వాతావరణంలో తయారైన పచ్చళ్ళు... 'ప్రియ' పచ్చళ్లు. అత్యుత్తమమైన మసాలా దినుసుల మేళవింపు వాటి ప్రత్యేకత. 'ప్రియ' మా ఇంట్లో అడుగు పెట్టిన నాటినుంచీ మేమందరం భోజన ప్రియులమయ్యాం. మీరు కోరే పలు రకాల్లో...

- మామిడికాయ
- నిమ్మకాయ
- టొమాటో
- అల్లం
- గోంగూర

తయారుచేయువారు:
**ప్రియ ఫుడ్స్ ప్రైవేట్ లిమిటెడ్.**
పోరంకి, కృష్ణాజిల్లా.

Marketed by
Margadarsi Marketing PRIVATE LIMITED
Eenadu Compound
Somajiguda,
Hyderabad-500 004.
Tel : 223422.







**ఎంతో రుచి... ఎంతో రుచి... ప్రియ**

KIRON/PF/80 4 A

'సూపర్‌మాన్'లో ఒక దృశ్యం

# సినిమా

### జ్యోతి చిత్ర

కె మురారి, విజయబాపినీడు రూపొందించే జ్యోతి చిత్రవారి తొలి చిత్రంలో మద్దూరి అరుణ అనే యువతిని నాయికగా పరిచయం చేస్తున్నారు. సింగీతం శ్రీనివాసరావు దర్శకుడు మహదేవన్ సంగీత దర్శకుడు మాగంటి రవీంద్రనాథచౌదరి, కె. నరసింహంనాయుడు ఈ చిత్రాన్ని సమర్పిస్తారు.

### గందరగోళం

సింగీతం శ్రీనివాసరావు డైరెక్షన్‌లో తయారయ్యే మరో చిత్రం లక్ష్మీనరసింహా ఇంటర్నేషనల్‌వారి ''గందరగోళం''. ''మే 12 నుంచి నరసాపురం, పాలకొల్లు పరిసరాలలో నెల రోజుల్లో పూర్తవుతుంది ఆగస్టు విడుదల,'' అన్నారు నిర్మాత ఎం. కె. మావుళ్ళయ్య. గుమ్మడి, చలం, అల్లు రామలింగయ్య, కె. వి. చలం, రమాప్రభతోపాటు కొందరు నూతన నటీనటులకు అవకాశమిస్తారు. శ్రీమతి సింగీతం కథకు శ్రీరమణ సంభాషణలకర్త. వేటూరి, సి నారాయణ రెడ్డి, ఆరుద్ర, చక్రవర్తి, జి. కె రాము తెరవెనుక కృషి చేస్తారు.



'కోడళ్లు వస్తున్నారు జాగ్రత్త'లో సంగీత, శ్రీధర్

### కె. జి. బి. ప్రొడక్షన్స్

విజయబాపినీడు నేతృత్వంలో మే 11 నుంచి జూన్ 10 వరకు బొడ్డపాడు, విజయవాడ పరిసర ప్రాంతాలలో ఒకే షెడ్యూల్‌లో పూర్తయ్యే చిత్రంలో మురళీమోహన్, నూతన్‌ప్రసాద్, మోహన్‌బాబు, నాగభూషణం, సరిత, అనిత, నిర్మల, హలం, మమత, రమాప్రభ ఆదిగా గల వారుంటారని నిర్మాత పి. శివలింగేశ్వరరావు తెలిపారు జంధ్యాల, చక్రవర్తి, గోపాల్‌రెడ్డి, సూరపనేని కళాధర్, కె సత్యం, పి. రవీంద్రబాబు సాంకేతిక సహకారంతో జి. రామమోహన్‌రావు దర్శకత్వం నెఱవుతారు

## "రాజాధిరాజు"

నటుడు విజయచందర్ సమర్పించే రామ చిత్ర వారి పై చిత్రంలోని కొన్ని ప్రధాన సన్నివేశాలను, పాటల చిత్రీకరణను ఇటీవల పత్రికా కర్తలకు చూపించారు. దేవునికీ, సైతాన్‌కూ మధ్య జరిగే ఘర్షణలో మానవుడు పడే పాట్లను చాలా తమాషాగా చిత్రీకరించారు. ఇదొక ఫాంటసీ చిత్రం. మనుషులను పావులుగా ఆడించే సైతాన్‌గా నటించిన నూతన్‌ప్రసాద్ "చలిచీమలు" తర్వాత ప్రజలు గుర్తుంచుకొనే మరో పాత్ర తనకీ చిత్రంలో లభించిందన్నారు. విజయచందర్ ఓ చలాకీ పాత్రతో పాటు జీసస్‌గానూ దర్శనమిస్తారు. శారద, సుమలత, హలం, రాజేశ్వరి, రమణమూర్తి, ముక్కామల, హరిబాబు, విక్రం, ఎం బి. కె వి ప్రసాదరావు, జె ఎన్ భూషణ్, బేబీ వరలక్ష్మి తక్కిన నటవర్గం. మహదేవన్, అహ్మద్ అజ్మీ, దిలీప్ సింగ్ సంగీతం, ఛాయ, శిల్పం నిర్వహించారు. ముళ్ళపూడి వెంకటరమణ, బాపు కాంబినేషన్‌లో తయారైన మరో మనోహరమైన చిత్రమిది. ఎస్ విజయలక్ష్మి, ఆర్ డి రెడ్డి, టి గోపాలకృష్ణ నిర్మాతలు.

## "తపతమాలక్ష్మి"

పై చిత్రాన్ని శ్రీ కృష్ణ కళామందిర్ బానర్‌లో వి కృష్ణయ్య సమర్పిస్తారు. చంద్రమోహన్, దీప, జ్యోతి, సత్యనారాయణ, ఈశ్వరరావు, వంకాయల, విలన్‌గా కొత్త నటుడు సాయిప్రసాద్ నటిస్తారు. జూలైలో చిత్తూరు ప్రాంతంలో షూటింగ్ ప్రారంభమవుతుందని నిర్మాత టి ఎస్ ప్రసాద్ తెలిపారు. గొల్లపూడి, ఇళయరాజా, జి వి ఆర్ యోగానంద్, రంగారావు, విజయ్ సాంకేతికవర్గంతో కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలను మదన్ మోహన్ వహిస్తున్నారు.





'కొంటె కుర్రాళ్ళ'లో శోభ, ప్రకాష్

## కొంటె కుర్రాళ్ళు

బాలు మహేంద్ర కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం, ఛాయాగ్రహణంలో దివంగతురాలైన శోభ నటించిన "కొంటె కుర్రాళ్ళు" చిత్రాన్ని నిర్మాత పి. వెంగళరెడ్డి త్వరలో విడుదల చేస్తారు. రాజశ్రీ మాటలు, ఆత్రేయ పాటలు రాశారు. సలిల్ చౌదరి సంగీత దర్శకుడు.

## మన వూరి రాముడు

టి. ఎల్. వి. ప్రసాద్ దర్శకత్వంలో ఛాయాగ్రాహకుడు పి. దేవరాజ్ సమర్పించే శ్రీ చేతన చిత్ర వారి ద్వితీయ చిత్రం "మన వూరి రాముడు" తొమ్మిది రీళ్ళకు పైగా తయారైంది. మురళీమోహన్, ఈశ్వరరావు, నాగభూషణం, కె. కె. శర్మ, సాక్షిరంగారావు, అర్జా జనార్ధనరావు, మిఠాయి చిట్టి, డాక్టర్ రాధాకృష్ణ, దీప, కవిత, పి. ఆర్. వరలక్ష్మి, జయమాలిని, టమోటాలక్ష్మి నటిస్తున్నారు. దాసం గోపాలకృష్ణ కథ, మాటలు రాశారు. ఆయనతోపాటు సి. నారాయణరెడ్డి, వేటూరి రాసిన గీతాలకు సత్యం స్వరకల్పన చేశారు. జూన్‌లో విడుదల చేయదలచినట్లు నిర్మాతలు పి. విజయకుమార్, ఎన్. మోహన రాజు, పి. సుందరి చెప్పారు.

చాలా రకాల సూటింగ్స్
కొన్ని ఋతువులలోనే నప్పుతాయి.
అన్ని ఋతువులలో మీరు మెచ్చే సూటింగ్‌ను
విమల్ మాత్రమే తయారు చేస్తుంది. అదే...



s the registered trademark of Reliance Textile Industries Ltd.



'రాజాధిరాజు'లో విజయచందర్

## పరోపకారి పాపన్న

''ఈర్ష్య, ద్వేషం, క్రోధంతో నిండి ఉన్న మన సమాజంలో ఇంకా పరోపకారపరాయణులు ఉన్నారంటే అతిశయోక్తి కాదు. పదిమందికీ తలలో నాలుకగా తిరుగుతూ, పరోపకారి పాపన్నగా పేరు పొందిన అనాథ యువకుడు పాపన్నకి చంద్రి అంటే ప్రాణం. చంద్రికి పాపన్న అంటే సర్వస్వం. చురుకుదనానికి, చలాకీదనానికి, అందానికి, అందమైన సమస్యకి ఆటపట్టు అయిన చంద్రి అంటే ఊరంతా ముచ్చటపడేది. బస్తీ నుంచి వచ్చిన జమీందారు పెద్దకొడుకు, ఆమె అందానికి వశమై, ప్రేమించాడు. ఆ సంగతి ఆమెకు తెలీదు. పాపన్నను పెళ్ళాడింది. దాంతో పెదబాబు పిచ్చివాడైపోయాడు. చంద్రి లేనిదే అతని బ్రతుకు వ్యర్థం. ఈ సమస్యను పరిష్కరించడానికి పరోపకారి పాపన్నకు తోచిందొక్కటే — ఆ విషయాన్ని భార్యతో చెప్పాడు. భర్త మాట తీసెయ్యలేక భగవంతుడిమీద భారం వేసి, పెదబాబును రక్షించడానికి బయలుదేరుతుంది చంద్రి కాని, అప్పటికే జమీందారు గజపతికి — చంద్రి తనకు అక్రమంగా కలిగిన సంతానమని తెలుస్తుంది. 'ప్రభూ! ఏమిటీ పరీక్ష!' అని ఆ ముసలిగుండె తల్లడిల్లిపోతుంది. ''తన పెద్దకొడుకు, చెల్లెల్ని ప్రేమిస్తున్నాడా? ఈ అక్రమాన్ని, ఘోరాన్ని ఆపడమెలా?'' ఇలా విచిత్రమైన మలుపులతో కథ సాగుతుంది,'' అంటూ టూకీగా కథ వివరించారు తిరుమల నాగూర్ కంబైన్స్ ''పరోపకారి పాపన్న'' చిత్రానికి స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహించిన డి. ఎస్. ప్రకాశరావు. తల్లీ కూతుళ్ళుగా కె. విజయ ద్విపాత్రలు నిర్వహించింది. చంద్రమోహన్, ఈశ్వరరావు, పొలంపల్లి, నాగేంద్రబాబు, వంకాయల, కాకరాల, గిరిజారాణి, శ్రీశైలజ, వైజయంతి, జ్యోతిలక్ష్మి, జయమాలిని పాల్గొన్నారు. విజయరత్నం సంభాషణలకర్త. ఎస్. హనుమంతరావు సంగీత దర్శకుడు. యోగానంద్ ఛాయాగ్రాహకుడు. కె. ఎస్. మస్తాన్ సమర్పణలో పి. కిష్టయ్య, ఎస్. నాగరాజ నిర్మాతలు. జూన్ విడుదల.

'గయ్యాళి గంగమ్మ'లో రజని



## స్టార్స్ ఇంటర్నేషనల్ చిత్రం

కృష్ణ, జయప్రద నాయకా నాయికలుగా పర్వతనేని సాంబశివరావు దర్శకత్వంలో ఎం. బాలకృష్ణ నిర్మించే చిత్రం షూటింగ్ మే 9 మధ్యాహ్నం ప్రారంభమైంది. అల్లు రామలింగయ్య, పి. ఎల్. నారాయణ, సుమంగళి, నిర్మల, అత్తిలి లక్ష్మి, చిట్టిబాబు పాత్రధారులు. జంధ్యాల, రాజన్—నాగేంద్ర, వేటూరి, వి.ఎస్.ఆర్. స్వామి, ఎస్. కృష్ణారావు తెరవెనుక కృషి చేస్తున్నారు.

## గోపీ మూవీస్

కృష్ణ సరసన జయప్రద నటించే మరో చిత్రాన్ని కె. రాఘవేంద్రరావు దర్శకత్వంలో నిర్మాత అడుసుమిల్లి గోపాలకృష్ణ జూన్ నుంచి మొదలెడతారు. రావు గోపాలరావు, అల్లు రామలింగయ్య, నూతన్‌ప్రసాద్, 'శంకరాభరణం' రాజ్యలక్ష్మి ఇతర ముఖ్య భూమికలు నిర్వహిస్తారు. సత్యానంద్, చక్రవర్తి, కె. ఎస్. ప్రకాష్, కోటగిరి వెంకటేశ్వరరావు, జాస్తి సత్యశేఖర్ వగైరా సాంకేతికవర్గం.

## శోభన్ - సుజాత కాంబినేషన్

''గోరింటాకు'' తర్వాత శోభన్‌బాబు, సుజాత నటించే చిత్రాన్ని తాతినేని రామారావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీ రాజలక్ష్మి ఆర్ట్ పిక్చర్స్ నిర్మిస్తారు. ఈ సంస్థ లోగడ 'పదహారేళ్ళ వయసు, నిండు నూరేళ్ళు' నిర్మించింది. ''జూలై 23వ షూటింగ్ ప్రారంభమవుతుంది,'' అన్నారు నిర్మాత మిద్దె రామారావు. భీశెట్టి లక్ష్మణరావ్ కథకు గొల్లపూడి మారుతీరావు సంభాషణలు రాస్తున్నారు. చక్రవర్తి సంగీత దర్శకుడు.

'లవ్ బర్డ్స్'లో గీత










కృష్ణ సమర్పించు
పద్మావతీ ఫిలింస్
రాబర్ట్ రామ్ రహీమ్
స్క్రీన్‌ప్లే-దర్శకత్వం
విజయనిర్మల
నిర్మాత: ఉప్పలపాటి సూర్యనారాయణబాబు
ఈస్ట్‌మన్ కలర్
సంగీతం: చక్రవర్తి
నవయుగ
mvkr

# సినిమా

## అల్లుడు పట్టిన భరతంలో రేఖ పని పట్టిన ముత్యాలు

సైకిల్‌షాపు ఎదురుగా రోడ్డుమీద రేఖ (జయసుధ) కారుకు అడ్డంగా నిలబడ్డాడు ముత్యాలు (కృష్ణంరాజు). రేఖ కోపంతో సడన్‌బ్రేక్ వేసింది. "మిస్టర్! ఇలా కార్లకు అడ్డుపడేది మనుషులు కాదు; పశువులు."

"పశువులు తోలే కార్లకు మనుషులు అడ్డుపడ్తారు తెల్సా? మనుషులకు జాలి, దయ అనే గుణాలుంటాయి. నువ్వు అవేవీ లేనిదానివి గనకనే సింహాచలం అనే పోలీసుకు ఉద్యోగం తీయించేశావ్," అన్నాడు ముత్యాలు.

"ఆ సింహాచలం డ్యూటీలో అశ్రద్ధగా ఉండటంవల్ల ఎవడో రాస్కెల్ నా కారును పాడుచేసిపోయాడు. అది తెలుసా నీకు?" రేఖ రెట్టించింది.

"ఆ కారును పాడుచేసినవాడు ఆ పని చేసింది కాలక్షేపానికి కాదు; కడుపు మండి. అటు చూడు ఒక్కసారి. నిన్న నువ్వు గాంధీనగరంలో నీ కారుతో ఆ బండిని గుద్దించి, కనీసం ఆపనైనా ఆపకుండా వెళ్లిపోయావ్. షికార్లు తిరగడానికి పది కార్లున్న నీకు ఓ కారు దెబ్బతింది. కాని, ఆ బండివాడికి పది బళ్ళు లేవు. షికార్లు చేసే ఓపికా లేదు. ఆ బండే వాడికి అన్నం పెట్టే అమ్మ తల్లి. దాన్ని నాశనం చేశావన్న కడుపుమంటతో నీ కారు చెడగొట్టాడు తప్పా?"

"అయితే, ఆ పని చేసినవాడు నీకు తెలుసన్న మాట? ఎవడు వాడు?"

రేఖ కోపం చల్లార్చడానికి సైకిల్‌షాపు ఓనర్ ప్రకాశం (నాగభూషణం) పూనుకున్నాడు. ముత్యాలును అవతలకునెట్టి, "మావాడు చిన్నప్పటి నుంచి ఇంతేనమ్మా. తన సుఖం పదిమందికీ పంచుతాడు. పదిమంది కష్టం తను అందుకుంటాడు. చూశావమ్మా! ఎన్నో కార్లున్న నీ దృష్టికి మామూలుగా కనిపించే ఆ బండి — బీదల కంటికి ఎంతో ఖరీదైనదిగా కనిపిస్తుందమ్మా. నువ్వదేం మనసులో పెట్టుకోకమ్మా. వెళ్లిరా!"

ముత్యాలు వంక క్రీగంట చూస్తూ, "స్నేహమంటే ప్రాణమిచ్చే మనిషిని నేను. అతను స్నేహితుడి కోసం తప్పు తనమీద వేసుకున్నాడంటే — ఐ లైక్ హిస్ సెంటిమెంట్... బై!" అంటూ బయలుదేరింది రేఖ.

కె. విశ్వనాథ్ దర్శకత్వం వెలువరిస్తున్న డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ "అల్లుడు పట్టిన భరతం" చిత్రానికి డి. వి. ఎస్. రాజు నిర్మాత.

## చుట్టాలున్నారు జాగ్రత్తలో వారీ వారీ నడుమ గంగులు

సుబ్బి (కవిత) ఆరున్నొక్క రాగం ఆలపిస్తోంది. మమ్మూర్తులా తన ప్రియుడు (కృష్ణ)లాగున్న గంగుల్ని (కృష్ణను) చూసి పొరబడటం వల్లనే ఆమెకు దుఃఖం ముంచుకొచ్చింది. అది తెలియక గంగులు "ఎవరమ్మా నువ్వు? ఎందుకమ్మా ఏడుస్తున్నావు? ఎలెక్షన్‌లో నిలబడి ఓడిపోయావా? లేక ఎవరైనా పెళ్ళి చేసుకుంటానని నమ్మించి మోసం చేశారా?" అంటూ ప్రశ్నల వర్షం కురిపించాడు.

"దిక్కుమాలిన సచ్చినోడా! నీ జిమ్మడ!"

"తప్పమ్మా. పెద్దవాళ్ళనలా తిట్టకూడదు తల్లీ!"

"ఆఁ! నేను నీకు తల్లినా?"

"పరస్త్రీ తల్లితో సమానమేకదమ్మా?"

ఇంతలో వనజ (శ్రీదేవి) వచ్చి, "ఎవరమ్మా నువ్వు?" అనే సరికి కవిత అరికాలిమంట నెత్తికెక్కింది. "ఈవిడ్ని పెళ్ళిచేసుకొని కులుకుతున్నావా?" అంది.

గంగులు అమాయకంగా "మేం పెళ్ళి చేసుకుంటే నీకెందుకమ్మా ఏడవు?" అన్నాడు.

"నన్ను చేసుకుంటానని ఒట్టేసి, ఇప్పుడు ఇంకొకతెతో కులుకుతున్నావంటరా దొంగ సచ్చినోడా!"

"ఏయ్! ఏమిటా వాగుడు! పోలీసుల్ని పిలిపించి, అరెస్టు చేయిస్తాను."

సుబ్బి ఏడుస్తూ వెళ్ళిపోయింది. గంగులు, వనజ ఒకరివంక ఒకరు తెల్లబోతూ చూసుకున్నారు. ఎం. బాలయ్య బి. ఎ., సమర్పించే అమృతా ఫిలిమ్స్ "చుట్టాలున్నారు జాగ్రత్త" చిత్రానికి బి. వి. ప్రసాద్ దర్శకుడు. జూన్‌లో విడుదల చేయనున్నట్లు నిర్మాతలు అంచపర్తి సూర్యనారాయణ, మన్నవ వెంకట్రావు చెప్పారు.★





'ఆడవాళ్ళూ మీకు జోహార్లు'లో జయమాలిని

'రామ్ రాబర్ట్ రహీమ్'లో రజనీకాంత్, కృష్ణ






# నిరీక్షణ

పొనుగంటి లక్ష్మీరాఘవి

అది ఉదయం తొమ్మిది గంటల వేళ కావడంతో, బస్సులు, తదితర వాహనాలు, రోడ్లు, అన్నీ కూడా జనసందోహంతో నిండివున్నాయ్.

బస్సులు రావడం అయితే చాలానే వస్తున్నాయ్ కానీ అందులో తనక్కావలసిన రూట్‌లో వెళ్ళేవి చాల తక్కువ నుంచోలేక విసుగొస్తోంది శారదకి షెల్టర్ వున్నా తూర్పున కభిముఖంగా వుండటంతో ఎండ ఆవేళపుడు తిన్నగా ముఖాలమీదకే ప్రసరిస్తోంటుంది నిత్యం. ఎండ తీక్షణతలోనూ, బస్ కోసమై నిరీక్షణతోనూ అలసిపోయి, ఆపైన బస్‌లోని రద్దీలో కుమ్మయిపోయి వెళ్ళి, కాలేజ్‌లో ఇక బుర్రేంపని చేయగలదు అన్పిస్తోంది శారదకు

ఎవరో ఇద్దరు కుర్రాళ్ళు, స్టూడెంట్స్‌లాగా వున్నారు చూడ్డానికి శారదవంకే చూస్తూ ఆమెను ఎలా అల్లరి చేయాలా, లేక ఆమెతో ఎలా మాట్లాడటమా అన్నట్లుగా చూస్తున్నారు శారద స్వతహాగా చాలా ధైర్యస్థురాలు. వాళ్ళ అల్లరిని పట్టించుకోకుండా చాల నిర్లక్ష్యంగా నిలుచొంది

అంతలోకే వచ్చాడు ఎవరో ఒకతను "విజయా, విజ్జీ, విజ్జీ" అంటూ పరుగెడుతూ వచ్చేశాడు అతడి వరస చూస్తోంటే తన కెంతో ప్రియతమ మయినదాన్ని, వదిలిపెడితే ఇక తిరిగి ఎప్పటికీ దొరకనంతటి అత్యంత అపురూపమయిన వస్తువు కోసం వచ్చినట్లుగా కన్పిస్తోంది

అతడి గడ్డం మాసిపోయి వుంది బాగా జుట్టు సంగతి అయితే సరేసరి. ఆ బట్టలయితేనా! అబ్బబ్బబ్బ అవి ఎంతకాలం నుంచో తమయజమానిని పట్టుకొని వదలక పోయినాయంటే ఆ మాత్రం వర్ణన కూడా చాలదేమో అనుకోవచ్చును అత్యంత విలువయిన నిధికోసం వెటాడి వెటాడి అలసిపోయి నిరాశ నింపుకొని నిల్చిపోయిన క్షణంలో ఆ నిధి అనుకోకుండా లభిస్తే అప్పుడు కలిగే తృప్తి తాలూకు మెరుపు అతడి ముఖంలో శారదని చూసిన క్షణంలో ద్యోతకమయింది

"విజ్జీ పద యింటికి పోదాం ఎన్నాళ్ళిలా ఇంతకాలమూ నువ్వెక్కడున్నావ్ ఎలా వున్నావ్? అసలు నిన్ను వదిలి ఎలా వుండగలననుకొన్నావ్. పద పద ఇప్పటికయినా మించిపోయిందిలేదు" చాల చొరవగా శారద చేయిపట్టి స్వంత మనిషిలాగా తనవెంట తీసుకపోవడాని కుద్యుక్తుడయినాడు బలవంతాన చెయ్యి విడిపించుకో జూసిందామె

అతడ్ని తనెరుగదు ఏనాడూ చూసిన గుర్తు అసలే లేదు ఆ బట్టలూ, ఆ తీరూ చూడబోతే పిచ్చాడిలాగా వున్నాడు మరి నన్నిలా గొడవ చెయ్యడమేమిటి? ఆ ఆదంతా వట్టి నటన కావచ్చు కొంతమంది ఇలాగే అనేకమైన వేషాలు వేసి రకరకాల మోసాలు చేస్తారట ఆమె విడిపించుకో జూస్తే అతడు మరింతగా పట్టు బిగించాడు అవతల బస్ వచ్చేస్తోంది ఇది గనక మిస్ అయితే ఇంతసేపటినుండీ వున్న తన నిరీక్షణ కాస్తా వేస్ట్ అయినా మళ్ళీ ఆగితే కాలేజీకి లైట్ అయిపోతుంది ఇంక లాభం లేదనుకొని అతడివంక చిరాగ్గా చూసింది ఆమె పెనగులాడినా విడువని అతడు, ఆమె మొహంలోని అసహ్యతను గుర్తించిన వెంటనే భరించలేని వాడిలా చెయ్యి వదిలేశాడు

అదేమీ గుర్తించని ఆమె తొంగారులో బస్ ఎక్కేసింది

అంతవరకూ ఆ సంగతిని శారద నోట విన్న తరువాత సుశీల దుఃఖాన్నాపుకోలేని దానిలాగా వెక్కి వెక్కి ఏడ్చేసింది

మధ్యాహ్నం లంచ్ అవర్‌లో టిఫిన్ కానిచ్చేసి చెట్టుక్రింద చేరి ఖబుర్లు చెప్పుకొంటున్న శారద సుశీలల మధ్య ఉదయం జరిగిన బస్‌స్టాప్ సంఘటన కూడ చోటు చేసుకొంది సుశీల ఎందుకు ఏడుస్తోందో అర్థంకాని శారద చిత్రంగా చూడ సాగింది ఆమెను ఎలా ఓదార్చాలో తోచలేదు శారదకి కాసేపటికి తేరుకొంది సుశీల

"సుశీలా ఇకనయినా చెప్పవే ఏం జరిగింది? నేను చెప్పిన బస్‌స్టాప్ ఉదంతానికీ నీకూ ఏమిటి సంబంధం?"

"వాడు. ...వాడు మా అన్నయ్య ప్రసాద్ అంటే నువ్వు నమ్మగలవా శారదా?" సాయంత్రం శారదా వాళ్ళడాబాలో కూర్చొన్నాక సుశీల అడిగింది "ఏమిటి? అతడు మీ అన్నయ్యా మరి నాకీ సంగతి చెప్పలేదేం?" శారద ఆశ్చర్యపోయింది

"మనకు పరిచయం అయి నిండా ఇరవై రోజులయినా కాలేదు, కానీ ఆ పరిచయం చాలా బలపడి పోయింది మనం ఎన్నో విషయాలు మాట్లాడుకొన్నాం అందులో ఇంట్లో వాళ్ళ సంగతులు పూరికే అడిగి ఒకరినొకరం తెలుసుకొన్నాం, కానీ వివరాలు పెద్దగా పట్టించుకోలేదు కదా! ఈ సంగతి నీకు చెప్పాల్సి వస్తుందని నిన్న

చూసిననాడే అనుకొన్నాను. కానీ ఆ రోజు రానీలే అన్నట్టుగా వూరుకొన్నాను. కానీ ఆరోజు ఇంత త్వరలో వస్తుందని అనుకోలేదు నేను.

ఉదయం నువ్వు లవ్ స్పాట్‌లో చూసింది మా అన్నయ్య ప్రసాద్‌ని. వాడి రూపూ, ఆ వైఖరీ చూసి నువ్వు వాడిని ఉత్త పిచ్చాడనుకొని వుండవచ్చు. కానీ నేను అనుకోవాలన్నా మనసురాదు నాకు.

మా అన్నయ్యకి మంచి ఉద్యోగం వుంది. అప్పట్లో వాడికి పిల్లనివ్వడానికి అనేకులు ముందుకొచ్చారు. కానీ వాడు ప్రేమించింది మాత్రం విజయ అనే అమ్మాయిని. స్వంతయిల్లు, కారు, మంచి ఉద్యోగం, హోదా అన్నీ వున్న మా అన్నయ్య తమ యింటి అల్లుడు కాకపోతాడేమో అనే ఆలోచనతో కొందరు కుట్ర చేయబోయారు కూడాను

కానీ అందరినీ కాదనీ, తాను ఎవ్వరినీ లెక్క చేయదలచు కోలేదనీ చెప్పి వాడు మాత్రం తను ప్రేమించిన విజయనే ఏరి, కోరి యింటికి తెచ్చుకొన్నాడు వివాహమాడి. వాళ్ళు కాస్త కలిగిన వాళ్ళేలే.

మా వదిన విజయ చాలా మంచిది. ఆమె అచ్చంగా నీలాగానే వుంటుంది అనేకంటే, సినిమాలలో చూపినవిధంగా నీవు, ఆమె కవల పిల్లలుగా ఏనాడో ఓనాడు ఋజువు అవుతుందేమో అనిపించింది నాకు నిన్ను చూడగానే.

'విజ్జీ విజయా' అంటూ ప్రతిక్షణం ఆమె



నామస్మరణే వుండేది మా అన్నయ్య నోటిలో. అది చూసిన అమ్మా, నేనూ క్రొత్తలో కాస్తంత అసూయ ఫీలయినా, తర్వాతర్వాత మా వదిన మంచితనం, వాళ్ళిద్దరిమధ్యా వున్న ప్రేమానురాగాలూ చూసి మాకూ ఎంతో తృప్తిగా, సంతోషంగా వుండేది వారి దాంపత్యం.

ఎంతో ఆనందంగా సాగిపోతోంది వారి జీవన నౌక. మా ఇల్లు ఆనందానికీ, ఐశ్వర్యానికీ ప్రతీకలాగా వుండేది చూచేవారికి కన్నులపండువగా.

కానీ వెన్నెల రేయిని వెంటతరిమే అమావస నిశీధిలాగా, మా ఇంటి కళలు పూర్తిగా చీకటిమయం అయేరోజు వుంటుందని అనుకోలేదు మేమెవ్వరమూ.

వదిన, అన్నయ్యల ప్రేమానురాగాలు ఫలించి మా వదిన కాస్తా ప్రెగ్నెంట్ అని తెలిసింది మాకు. ఎంతో సంతోషంతో ఇల్లంతా దివ్యదీపావళిలాగ సంతోష తరంగాలతో నింపేశాము. నెలనెలా ఒక పండుగ చొప్పున జరిపించారు ఇరువైపులా వియ్యంకులు.

అన్నయ్య ఆమెను వీడి వుండలేనివాడిలాగా ఏడవమాసంలో పుట్టినింటికి పంపడానికి అంగీకరించలేదు. ఇక తప్పనిసరియై తొమ్మిదవమాసాన మాత్రం పంపటానికి అంగీకరించాల్సి వచ్చింది.

ఆ రోజున పెద్ద పండుగ జరిపించాం మేము. వదిన వాళ్ళ అమ్మా నాన్నగారూ, చెల్లెలూ వచ్చారు మా ఇంటికి. వేడుకలన్నీ ముగించారు. రాత్రి కారు ఎక్కేముందు మా వదిన అమ్మకూ, నాన్నగారికీ, అన్నయ్యకూ కూడ నమస్కరించింది. నా దగ్గరికి వచ్చి చేయిపట్టుకొని "సుశీ, మేనల్లుడు పుట్టాడని తెలియగానే బయల్దేరి రావాలేం. ఒంటరిగా వస్తే గనుక, నిన్ను మీ మేనల్లుడు రానిచ్చేదిలేదు. అందుచేత మీ అన్నయ్యను, అమ్మా, నాన్నగార్లనూ కూడ తీసుకొని వెంటనే రావాలి. తరచూ ఉత్తరాలు రాస్తూ వుండు. మరి వెళ్ళిరానా ఇంక. అక్కడ ప్రతిక్షణం నిన్నే తల్చుకొంటూ, రాబోయే నీ మేనల్లుడికి నిన్నిప్పట్నుంచే పరిచయంచేస్తూ వుంటాను తెలుసా" చిన్నగా నవ్వింది వదిన.

నేనూ నవ్వి "ఇప్పట్నుంచే హడలిపోయేలా మాత్రం చెయ్యకు వదినా" అన్నాను. అందరికీ నమస్కరించి సెలవు తీసుకొన్నాక కారెక్కింది వదిన. వదినా వాళ్ళ కారు బయలుదేరి కనుమరుగయ్యేదాకవుండి లోనికొచ్చేశాం అంతా.

మర్నాడుదయం నిద్రలేస్తూనే షాకింగ్ న్యూస్. వీళ్ళు వెళ్ళిన కారుకి మధ్యదారిలో యాక్సిడెంట్ అయిందట. వివరాలకోసం వెంటనే కారేసుకొని వెళ్ళారు మా నాన్నగారు, అన్నయ్యా.

ఏక్సిడెంట్‌లో అంతా పోయారుట. మా ఇంటి వెలుగు వదిన మాకిక లేదు. వాళ్ళ కుటుంబానికి అంటూ ఎవరూ మిగలనే లేదింక. అన్నయ్యనెలా ఓదార్చాలా అనుకొన్నాం మేము. కానీ అన్నయ్యకు మెంటల్ షాక్ వచ్చింది. తను ఏడ్వటం లేక బాధ పడటం, అప్పుడు మేము వాడ్ని ఓదార్చటం అనే ప్రసక్తే లేదింక. వాడు వదిన ఎంతకూ తిరిగి రావడంలేదన్న రీతిలో నిరీక్షిస్తున్నాడు. కొద్దిరోజులు మామూలుగానే సాగాయి

## నిరీక్షణ

ఆ తర్వాత ప్రతి అమ్మాయినీ చూసి విజయా అంటూ దగ్గరికి వెళ్ళి పలుకరించి, మొహం చూడగానే నిరాశగా మారిపోయి వచ్చేయటం, ఇలా తయారయింది వాడి పరిస్థితి. వాడి ఉద్యోగం పోయింది. మా అమ్మ, నాన్నగారు బెంగతో వాడినేం చేయాలో, ఎలా సరిదిద్దాలో అర్థంకాక మంచమెక్కారు. ఇక అన్నింటికీ మొండిలా, రాయిలాగా నేనే ఇలా మిగిలిపోగలిగాను శారదా! నిన్ను చూడగానే నాలో చాల ఆశలు చెలరేగాయి. మా అన్నయ్య జీవితం మళ్ళీ మామూలుగా చెయ్యాలి అంటే అది కేవలం నీ ఒక్కదానివల్లనే కావొచ్చనీ, నువ్వు వాడితో చనువుగా మసలితే వాడు ఇదివరకటి ప్రసాద్ అవుతాడనీ అనుకొన్నాను. కానీ అందుకోసం నిన్నన్యాయం చెయ్యడం నాకు ఇష్టంలేదు. అందుకే నీకీ సంగతులన్నీ చెప్పలేక పోయాను. వెళ్ళొస్తా శారదా! మా అన్నయ్య ఈ ఉదయం నిన్ను బస్ స్టాప్‌లో బాధించి ఉంటే క్షమించు" అంటూ వడివడిగా మేడమెట్లు దిగి వెళ్ళిపోతోన్న సుశీలతో ఏమీ చెప్పేటందుకు కూడ వీడివడలేదామె కంఠంలో సుళ్ళు తిరిగిన బాధా వీచికలు.

### చిత్రహింస

ఆరాధించాను
దేముడవని నమ్మి
ఆవేదన చెందాను
శిలవని తెలిసి
నిన్నటి ఆరాధన
నేటి ఆవేదనా
కోసి చేస్తున్నాయి
మాటలు రాని మనస్సును.

—ఎస్. లక్ష్మీసాగర్

మళ్ళీ మర్నాడుదయం అదే బస్‌స్టాప్, అదే మనుషులూ. బస్‌లు కూడ ఒకదాని వెనుక ఒకటి వస్తున్నాయ్. తన బస్‌కోసం ఎదురు చూస్తోంది శారద.

"విజయా, వచ్చేశావా! నాకు తెల్సు నువ్వు తప్పకుండా వస్తావని. నిన్న ఎందుకలా చూశావ్ నావైపు. ప్లీజ్ అంతకోపం తెచ్చుకోకు నామైన. నేనేం తప్పు చేశానని నన్నిలా శిక్షిస్తున్నావో నాకు తెలీడంలేదు. రావా నాతో. మనింటికిరా. అక్కడ అమ్మా, నాన్నా, చెల్లాయ్ అంతా నీకోసమే చూస్తున్నారు రా ముందు" బలంగా చెయ్యి లాగుతున్నాడతను

అతడి కథలోని విషాదానికి తాను ఎంతో చలించిపోయింది కాని తానేం చేయగలదు? అతనికి జీవిత సహచరి కావాలి అంటే అదెలా సాధ్యమవుతుంది? ఇలా ఆలోచిస్తోండగానే బస్ కనబడింది వస్తూ.

"రా విజయా! ఈ క్షణం మాత్రం రానంటే నిన్ను వీడిచేదిలేదిక. నిన్న కనపడి తప్పించుకొన్నావనుకొంటున్నావు గానీ ఈ రోజు తప్పించుకోలేవు నువ్వు. నువ్వు ఏమైనాసరే నాతో వచ్చితీరాలిప్పుడు" అంటూ శారదను గట్టిగా చేయిపట్టి ఈడ్చుకుపోయేటంత తీవ్రంగా ఉన్నాడతడు. బస్ వచ్చేసింది. అందరూ ఎక్కేస్తున్నారు. ఇతడి సంగతి తర్వాత ఆలోచించవచ్చుగానీ ముందు తాను బస్ ఎక్కకపోతే ఇంక అయినట్లే అనుకొన్న శారద అతడినుండి చెయ్యి విడిపించుకోవాలని తన బలం అంతా వుపయోగించింది. సాధ్యం కాలేదు. ఏం తోచిందో ఏమో ఆమె చెయ్యి ఒక్క క్షణంలో బలంగా అతడి చెంపని తాకింది.

ఐదువేళ్ళూ ముద్రవేసిన తన చెంపని తడుముకొంటూ కదలిపోతున్న బస్‌ని చూస్తూన్న అతడి మనోఘోష మాత్రం ఆమెను చేరలేక పోయింది.

"ఛీ. తానెంత పాడుపని చేసింది. అతడి సంగతి మొత్తంగా తెలిసి కూడ అతడ్నర్థం చేసుకోలేక పోయింది. అతడి ప్రవర్తనకు తను కూడ పదువుకోలేని దానిలాగా విసిగిపోయింది. చాల అసహనంగా ప్రవర్తించి అతడిని చెళ్ళున కొట్టింది. అతడేమనుకొని వుంటాడో, ఎంత బాధపడి వుంటాడో మరి. అసలే సున్నిత హృదయుడాయె. తానీ రోజు చేసిన పనికి అతను మరీ చలించిపోయివుండవచ్చు. దానితో అతడి మనోవేదన అధికమై ఇంకా వున్మాదిగా మారినా మారవచ్చును. ఇంతగా చదివిన నా తెలివితేటలు దేశానికి ఉపయోగపడినా పడకున్నా, కనీసం ఈ దేశంలోని ఒక వ్యక్తినయినా సంతోషింప చేసి, తిరిగి మామూలు వ్యక్తిగా చేయగలిగితే అందుకు మించినదంటూ ఇక తనకు తగిన ప్రయోజనమేముంటుంది గనక. అతణ్ణి గురించి సర్వం తెల్సిన తానా విధంగా కొట్టటం అది నిజంగా క్షమించరాని నేరం.

అందుకే, తను తప్పక రేపు వెళ్ళి అతడిని క్షమార్పణ చెప్పుకోవాలి. తాను అతడి విజయనేనని చెప్పినందువలన అతడు మారటమేకాకుండా సుశీల, తల్లిదండ్రులుకూడ ఆనందతరంగ మనస్కులవుతారు. ఇంతమందిని ఆనందింపచేయాలనే కాబోలు ఆ భగవంతుడు తనకు ఆ విజయ రూపాన్నే ఇచ్చాడు. రేపే తప్పక వెళతాను."

ఆ రాత్రి ఆ విధంగా ఆలోచించిన శారదకు తన నిర్ణయం తృప్తినివ్వగా హాయిగా నిద్రించిందామె.

"సుశీ. వచ్చేశా సుశీ మీ వదినగా. ఇక మీకు అంతా చిరునవ్వులపంటలే" అంటూ లోనికి అడుగుపెట్టిన శారద నిస్తేజయైపోయింది.

"నా విజయే నన్ను నడిరోడ్డులో చెంపదెబ్బ కొట్టి అసహ్యతతో చూశాక ఇంక నాకీ బ్రతుకెందుకు" అంటూ ఎంత వారించినా వినక అన్నయ్య పై డాబానుండి క్రిందికి దూకేశాడు శారదా! ఇన్నాళ్ళూ మా వదిన కోసం నిరీక్షించిన వాడి నిరీక్షణకిదే ముగింపు అయింది" అంటూ దుఃఖోద్వేగంతో కుమిలిపోతోన్న సుశీలనూ, ఆమె తల్లిదండ్రులనూ చూస్తూంటే శారద కళ్ళు కూడా దుఃఖసముద్రానికి వరద వచ్చినరీతిలో వర్షించసాగేయి ●

# బొమ్మల మహాభారతం — సంజయ రాయబారం — మండపాక సీతారామాంజనేయులు

( గత సంచిక తరువాయి )


















సంజయుడు పాండవులచే సత్కృతుడై హాస్తినాపురానికి తిరుగు ప్రయాణము సాగించెను




[ఇంకా ఉంది]

# గొప్ప జతగా

## భారతదేశపు ఏకైక దుర్గంధనాశక సబ్బు మరియు టాల్క్

దుర్గంధంనుండి రెండురకాలుగా రక్షణకు
సరైన జోడీ... సింథాల్ సబ్బుతో
స్నానం, ఆపైన సింథాల్
టాల్క్ చల్లుకోవడం ..మీరు ఎంతో,
మరెంతో తాజాదనంతో హాయిగా
మురిసిపోయేందుకు.







**గోద్రెజ్ వారి సింథాల్**

Interpub/CTS/1/80

## - ధర్మపథం -

# జాగ్రదవస్థ - స్వప్నావస్థ

అవస్థలు మూడు. అవి — జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్తి అవస్థ. మనం మేలుకొని వుండే అవస్థ జాగ్రదవస్థ. గాఢంగా నిద్రించే అవస్థ సుషుప్తి. ఈ రెంటికీ మధ్యనుండేదే స్వప్నావస్థ. ఆ అవస్థలో పరిపూర్ణమైన నిద్ర ఉండదు. కలలు వస్తూ ఉంటాయి. కొలది నిమిషాల కాలంలో కొన్ని యేండ్ల సంఘటనలు చిత్ర విచిత్రంగా కలలో కాన వస్తాయి. ఆ కలలు కూడా జ్ఞప్తిలో ఉండవు. అది అంతా భ్రాంతి మూలకమైనది. ఈ కలలకు కారణం మనస్సే! మనస్సులో ఏదో అనుకుని నిద్రపోతే — ఆ నిద్రలో, ఆలోచించిన సంఘటనలు కానరావచ్చును. తెలివి వచ్చిన తర్వాత "ఇది కల గాని నిజం కాదు. వట్టి భ్రాంతి" అని తోస్తుంది.

జాగ్రదవస్థలో — అంటే మేలుకొని ఉన్న అవస్థలో మనం నిత్య కృత్యాలు నెరవేర్చుకుంటున్నాము. పని పాటలు చేసుకుంటున్నాము. అవసరమైన వాటిని సేకరించి జీవయాత్ర సాగిస్తున్నాము. దృశ్యమానమైనదంతా స్థిరమైనదే అని అనుకుంటున్నాము. కాని జ్ఞానులైన వారు — కనబడేదంతా కూడా స్వప్నంలో చూచిన దానివలెనే భ్రమయే కాని స్థిరమైనదీ, నిత్యమైనదీ కాదని అంటారు. మాయా రూపమైన అజ్ఞానం ఆవరించి ఉన్నప్పుడే నిత్యంకానిదంతా నిత్యంగా కానవస్తుంది. యథార్థానికి ఏవీ స్థిరమైనవి కావు. ఎంతో దృఢంగా నిర్మించిన భవనాలు కొన్నాళ్లకు శిథిలాలయి పోతాయి. అన్ని వస్తువులూ అంతే. ప్రాణుల సంగతి చెప్పనక్కరయే లేదు. అజ్ఞానావృతులకు ఇవన్నీ నిత్యములుగానే కావవస్తాయి. ఇవి కూడా స్వప్నంలోని దృశ్యాలవంటివే కాని వేరు కావు. అందువల్ల అవిద్యా మూలమైన వీటిని నమ్ముకోకుండా ముక్తికోసమే పాటు పడాలని శంకరభగవత్పాదుల సదుపదేశం.

జాగ్రత్ — స్వప్నావస్థలను గూర్చి శ్రీ శంకరులు ఈ విధంగా చెప్పారు —

"స్వప్నేఽర్థశూన్యే సృజతిస్వశక్త్యా
భోక్త్రాదివిశ్వం మన ఏవ సర్వమ్,
తథైవ జాగ్రత్యపి నో విశేషః
తత్ సర్వమే తన్మనసో విజృంభణమ్."

"స్వప్నము అర్థములేనిది. దానియందు మనస్సే తన శక్తివల్ల ప్రపంచమును సృజించుచున్నది. జాగ్రదవస్థ కూడ స్వప్నము వలె భ్రాంతి కల్పితమే. అందువల్ల జాగ్రదవస్థయు, స్వప్నావస్థయు సమానములే! వ్యత్యాసము కానరాదు. ఈ రెండవస్థల యందును స్ఫురించుచుండు విశ్వమంతయు మనస్సు కల్పించినదే కాని యథార్థమెంత మాత్రము కాదు" అని దీని అభిప్రాయము.

- బులుసు వేంకటరమణయ్య




జి. వి. కె. ఆర్. — హైదరాబాదు

నాకు నలభై. ఇప్పటికీ నాన్నగారు జాతకాలు అంటూ ఏ సంబంధం వడనీయడంలేదు.

★ అయ్యో! కొత్త రెండు రోజులు ముందే ప్రారంభించాల, ఒక్కరోజు ఆలస్యం చేసేకంటే! ఉద్యోగం వుంది. పెళ్లాన్ని పోషించే చేవ వుంది. మీకు నచ్చిన అమ్మాయిని మాట్లాడక చేసుకోండి. మీ నాన్న — ఆ అమ్మాయి జాతకమే బ్రహ్మాండంగా వుంది — అని సర్దుకుంటారు!

ఎస్. ఎమ్. జె. — బండారులంక

అక్కయ్యా! నీ ఫొటో అచ్చు వేయించమని కోరినప్పుడు — జడుసు కొంటారంటావే — మరి బావగారు నిన్ను ఎట్లా చేసుకున్నారన్నది న అందరికీ కల్గిన ధర్మ సందేహం...

★ జిన్నా భయ్యా! ప్రేమ గుడ్డిదనీ, తా వలచినది రంభగా కన్పించేలా చేస్తుందనీ తెలియదా?!

పి. ఎస్. ఆర్. — దుమ్‌దుమా (ఒరిస్సా)

మీకు వివాహం కాక ముందు ఎవరైనా మీ హృదయంలో ప్రవేశించారా?

★ ఆఁ—!

ఎల్. జె. ఆర్. — కలకత్తా

ఆడపిల్ల లక్ష్మీకరం అంటూనే ఆడపిల్ల పుట్టిందని అనగానే — నిరుత్సాహ పడటానికి కారణం?

★ ఏంలేదు — బాధ్యత ఎక్కువవుతుందేమో నన్న పిరికితనం.

ఏ కోరికైనా చంపుకోవడం మంచిదా? కాదా?

★ కోరికలు చంపిన కొద్దీ పెరుగుతాయి. అంచేత వాటిని చంపే ప్రయత్నం కాదు చేయవలసినది — అదుపులో వుంచే ప్రయత్నం.

ఎస్. ఎన్. ఆర్. - ఆదోని

ఆడదానికి మగవాడు కట్టిన తాళి, కుక్కకు యజమాని కట్టిన తాడు లాంటిది. మీరేమంటారు?

★ తమ విజ్ఞానానికి అచ్చెరువు చెందుతున్నాను నాగరాజుగారూ! ఎందుకు — కుక్కల్ని అవమానిస్తారు? మీలాంటి వాళ్ళు తాడు కట్టబోతే — కరుస్తాయవి...!!

బి. ఎస్. ఎల్. — ఐరాల

ఎంతవారినైనా విడదీసే శక్తి కాలానికి వుంది. అయితే — మమతామురాగాలూ, ప్రేమానురాగాలను విడదీయగలదా?

★ వివాకేం పిచ్చా వెర్రా! ఆ కాలం కాస్త కలిసివస్తే — తెలుస్తుంది మీకు — ఎంతమంది శత్రువులు తయారవుతారో. ఎంత మంది మిత్రులే శత్రువులుగా మారి పోతారో.

జి. బి. ఎస్. — ప్రాసంగులపాడు

తెల్లవారడం, తినటం, వినటం, రాత్రి అవడం, తినడం, నిద్ర పోవడం—మట్టిలో కలసి పోవడం — మరుక్షణమే మరిచి పోవడం — అలాంటి అప్పుడు జీవితం ఎందుకు? జీవించి సాధించేది ఏమిటి?

★ కాలంలో మీరూ మీ జీవితం ఎంతటిదని మీ వూహ! పుట్టడానికి కారణం వుందంటారా? గిట్టటానికి కారణాలు వెతకడానికి! పుట్టాము కనుక — జీవన ప్రవాహంలో వున్నంత కాలం — తేలి వుండాలి కనుక — బ్రతుక నేర్వాలి. ఆ ప్రయత్నంలోనే — మన కాలం గడిచి పోతుంది.

కె. జి. ఎస్. — కుప్పం

మీరు ఆస్తికులా? నాస్తికులా?

★ ఏ విషయంలోనూ మీరడిగేది? ఆస్థి విషయమా? అదినాస్తి.

కె. కె. కె. వి. — కదిరి

మీరు ప్రశ్నలకు కరెక్టుగా జవాబు లివ్వరట. కొందరి అభిప్రాయం.

★ నిజమే! ఓ గ్రాము అటూ యిటూ అవుతుంది — చేతి తూకం కదా!!

వి. ఎమ్., వి. జె., వి. కె., వి. ఆర్. వి. జె. — చిత్తూరు

పవిత్ర ప్రేమకు నిర్వచనం ఏమిటి?

★ పవిత్రమైన ప్రేమ.

వరకట్న నిషేధానికి మార్గమే లేదా? మాబోటి మధ్య తరగతి ఆడపిల్లల గతి ఏమిటి?

★ ఆడపిల్లలు వ్యక్తులు కారా? ఆడపిల్ల అయినంత మాత్రాన — పెళ్ళాడి తీరాలా? జీవితంలో స్థిరపడడానికి పెళ్లికూడా ఒకమార్గం. ముందు చదువుకోవాలి — డాక్టరేట్లకోసం కాదు— పునాది దిట్టంగా — అవసరం అయితే ఒక వృత్తి చేపట్టగల చేవనిచ్చే డిగ్రీ దాకానేనా ఆడపిల్లలు చదువుకోవాలి. ఆర్థికంగా సంపాదనా పరులు కావాలి. తమ కాళ్లపై తాము నిలబడగల ధైర్యస్థులు కావాలి. తరవాతే పెళ్లి. పెళ్లికి పిల్ల ఉద్యోగాన్నే ముడివేసే సంబంధాలూ, పెళ్లికి కట్నానికీ — ముడివేసే సంబంధాలూ—అమ్మాయిలు ధైర్యంగా తిరస్కరించిన నాడే — యీ సమస్య కాస్త తిరుగుముఖం పడుతుంది. లేదా అంతే — చదువుకుని ఉద్యోగం చేస్తూ ఆర్థిక స్వాతంత్ర్యం లేక, పిల్లల్ని కని సంసారాలు యీదుతూ — ఎవరూ పంచుకోని భారం మోస్తూ 'నాకూ పెళ్లయింది' అన్న తృప్తి మినహా ఏమీ లేకుండా బ్రతికెయ్యాలి. అంచేత ఏ మార్గం కావాలో మీరే తేల్చుకోవాలి.




## అనారోగ్యులు అభాగ్యులు

మీకు విశాలమైన ఛాతి, దృఢమైన శరీరం మంచి తూనిక గలదా? లేకుంటే వెంటనే 'జీవన్‌టోన్' ఉపయోగించుట మంచిది. మీరు ఒక పౌండు జీవన్‌టోన్ కొన్నారంటే మీ శరీరం దృఢమై, తూనిక అధిక మగుటకు మేము గ్యారంటీ ఇవ్వగలము.

## ఆరోగ్యమే భాగ్యము

నిజమే ఆరోగ్యమే భాగ్యము. ఆరోగ్యం బాగా వున్నట్లయితే డబ్బును సంపాదించడం అసాధ్యమేమీ కాదు! లేకుంటే.... జీవన్‌టోన్ సాధారణమైన వ్యక్తులకు వచ్చే వ్యాధులను ఇట్టే బాగుచేయగలదు. మీరు మీ వయసుకన్న అధిక వయసుగలవారిలా గోచరిస్తున్నారా? అలాగైతే వెంటనే ఉపయోగించడం ప్రారంభించండి 'జీవన్‌టోన్'. మీకు తగినంత ఆరోగ్యం దృఢకాయం, తూనిక సమకూరిన వెంటనే జీవన్‌టోన్ ఉపయోగించుట ఆపుచేయాలి.

కాగా దేహానికి బలం సమకూర్చడానికి, తూనిక అధికరించడానికి జీవన్‌టోన్‌లో కొన్ని విశేషమైన మూలికలు చేర్చబడి యున్నవి. కాని ఇందులో జంతువుల క్రొవ్వు చేర్చబడి యుండలేదు.

స్పెషల్ జీవన్‌టోన్ పెద్ద సీసాలు అన్నిచోట్ల సులభంగా లభించగలవు. (వ్యాయామం అవసరంలేదు. ఒకవేళ ఇంతకుముందు అలవాటు వున్నట్లయితే కొనసాగించవచ్చు.)

వెల : **454** గ్రాములు (1 పౌండు రు. **18/-**)

సెల్‌బాయిల్ మరియు సెక్సో పౌడర్ : వయసుకు వచ్చినవారికి మాత్రమే

వెల : రు. **24-00** (ఉభయములకు)

స్కిన్ టిప్స్ : మొటిమలను తొలగించి మీ ముఖమును సుందరముగా తేజోవంతముగా నుంచును.

వెల : రు. **20-00**

### క్రిందిచోట్లయందు లభించగలవు :

వరంగల్ : ఆయుర్వేద రసాయనశాల, జె. పి. ఎన్. రోడ్డు, ఆయుర్వేద మెడిసిన్ ఆయుర్వేద ఇన్‌గ్రిడియన్స్, ఎస్. వి. రోడ్డు. మచిలీపట్నం : ఉమామహేశ్వర ఆయుర్వేదిక్ ఏజెన్సీస్, తెనాలి : గుడివాడ హనుమంతరావు & సన్స్. హైదరాబాద్ : సంపత్ & కం., పంజగుట్ట, జైరాం మెడికల్స్, కోటి, బ్యాంక్ రోడ్డు, వసంత్ మెడికల్‌స్టోర్స్, 4-4-293, బ్యాంక్‌రోడ్డు, మహేశ్ మెడికల్‌హాల్, క్లాక్ టవర్ ఎదుట, విష్ణు మెడికల్ హాల్, గుల్జార్‌హౌస్. ఇచ్ఛాపురం : జనతా మెడికల్‌స్టోర్స్. పర్లాకిమిడి : పి. ధర్మనారాయణమూర్తి & సన్స్. కాశీబుగ్గ : తంగుడు నారాయణమూర్తి. టెక్కలి : టి. ఎస్. ఎన్. మూర్తి. పార్వతీపురం : పద్మినీ మెడికల్ స్టోర్స్. పాలకొండ : సూర్య డ్రగ్ హౌస్. శ్రీకాకుళం : పట్నాల సత్యనారాయణ అండ్ సన్స్, పాలకొట్టు స్ట్రీట్. విజయనగరం : ఘట్టాల లింగప్రసాదరావ్ మెయిన్‌రోడ్డు. విశాఖపట్నం : నీలం & కం., ఎ.వి. ఎన్. కాలేజి రోడ్డు, డా. జె.వి. శాస్త్రి, సూర్యాబాగ్ జంక్షన్. రాజమండ్రి : ఈశ్వరదాస్ & కం., జైహింద్ బిల్డింగ్. గుంటూరు : ఆంజనేయ మెడికల్స్, జిన్నా టవర్ సమీపం. శ్రీ సత్యనారాయణ ఏజెన్సీస్. కాకినాడ : లక్ష్మీనారాయణ కంపెనీ. విజయవాడ : శ్రీ ధనలక్ష్మి మెడికల్‌స్టోర్స్, సూర్యా మెడికల్ స్టోర్స్, పార్కురోడ్డు. అనకాపల్లి : కానుమంచి అప్పలరాజు. మదనపల్లె : హయగ్రీవ షాప్, 10/75 నెహ్రూ స్ట్రీట్. నెల్లూరు : కె. ఎస్. రావ్ & సన్స్, ట్రంక్‌రోడ్డు. సూర్యాపేట : కమర్షియల్ సూర్య నివాస్ – 2 టవున్ పోలీస్‌స్టేషన్ ఎదుట. సికిందరాబాద్ : జ్యోతిమెడికల్ హాల్ 28. ఎమ్. జి. రోడ్డు, డి. జె. పరేక్ & కంపెనీ, సుభాష్‌రోడ్డు. జుమ్మా మసీదు, శారదాస్టోర్స్, 3106 రాష్ట్రపతిరోడ్డు. కావలి : డా. మల్లేశ్వరరావ్, ఆర్.ఎమ్.పి. మెస్సర్స్ సుగుణ ఆయుర్వేద ఆలయం. రేపల్లె : రామకృష్ణ మెడికల్ అండ్ జనరల్ ఏజన్సీస్, రైల్‌పేట. తాడేపల్లిగూడెం : కల్యాణరామ ఆయుర్వేద వైద్యశాల, మామిడివారి స్ట్రీట్, పోవర్ బ్రిడ్జి సమీపం. కందుకూరు : సుమిశెట్టి వెంకటేశ్వర్లు మెడికల్ స్టోర్స్. తిరుపతి : తరిగొండ మెడికల్స్, 247-బి, సరోజినిరోడ్డు. అనంతపురం : డి. సోమనాథశాస్త్రి, మునిసిపల్ కాలని. రామచంద్రపురం : రూపా మెడికల్‌స్టోర్స్, మునిసిపల్ మార్కెట్టు, సుభాష్ రోడ్డు. అనంతపురం : కో-ఆపరేటివ్ సెంట్రల్ సొసైటీ లిమి., రైల్వేస్టేషన్ సమీపం. పులివెందుల : శ్యామల మెడికల్ స్టోర్స్, మెయిన్‌బజార్. హిందూపురం : కె. ఆర్. భాస్కరయ్య & సన్స్, మెయిన్ బజార్. బాలాజీ మెడికల్ సెంటర్, మెయిన్‌బజార్. ఆదోని : కమలాపురె గోవిందశెట్టి, ఆర్. ఎమ్. పి. కమలాపుర్ నాగయ్యశెట్టి & సన్స్, కొత్తగూడెం : వరేంద్రుల శంకరయ్య & సన్స్. ధర్మవరం : శ్రీ పంజాండేశ్వర మెడికల్‌స్టోర్స్, మెయిన్‌బజార్. గుంతకల్లు : గోపాల్ మెడికల్‌స్టోర్స్. జంగారెడ్డిగూడెం : జేడ వెంకటరావ్. రాయదుర్గం : శ్రీ లక్ష్మీవెంకటేశ్ మెడికల్‌స్టోర్స్. తాడిపత్రి : కృష్ణ మెడికల్స్, మెయిన్‌రోడ్డు. గోరంట్ల : వెంకటేశ్వర మెడికల్ స్టోర్స్, హిందూపురం పోస్ట్. కర్నూలు : శ్రీ రామకృష్ణ మెడికల్‌హాల్, 52/19 జాన్సియన్‌రోడ్డు. గుత్తి : డి. ఆర్. రాజాశెట్టి & సన్స్, మెయిన్ బజార్. పామిడి : ఎస్. సి. చిన్నప్పశెట్టి. కడప : శ్రీ సాయిరామ్ ఆయుర్వేదిక్ మెడికల్స్, 13/348 మునిరావ్ స్ట్రీట్. గిద్దలూరు : ఎమ్. సాంబయ్యశాస్త్రి అండ్ సన్స్. ఆన్సి మెడికల్‌స్టోర్స్ అండ్ బుక్ సెల్లర్స్.

**అధికృత విక్రయందార్లు : మెస్సర్స్ : బాలాజి కెమికల్ వర్క్స్,** ఎ. పి. ఐ. ఇ. 5 వ రోడ్డు, బాలనగర్, హైదరాబాదు—37, ఫోన్ : 269490.

పై పేర్కొనబడిన తయారీలు మీ వూరియందు లభించనట్లయితే దయచేసి రు. 5—00 మాకు పంపిన మీకు వి. పి. పి. ద్వారా పంపగలము.

**మెసర్స్ : జీవన టోన్ ప్రొడక్ట్స్,** పోస్టుబాక్స్ నెం. 880, 17/1, కెంపబిడ్డి రోడ్డు, అలుసూరు. బెంగుళూరు 560 008.

# విలువైన బహుమతి

ప్రతాప రవిశంకర్



సాయంత్రం అవుతున్నకొద్దీ సుజాతలో ఆతృత పెరిగిపోయింది. మధ్యాహ్నం నించీ ఆఫీసుకు లీవ్ పెట్టి ఆమె పడుతున్న శ్రమను చూస్తూనే వున్నాను.

విగురు చూసినట్టుగానే ఆలస్యంగా చీకటి పడింది. ఇంటినిండా దీపాలు వెలిగించింది సుజాత

"నువ్వొక్కదానివే ఇలా కష్టపడిపోవడం నాకు చాలా ఇబ్బందిగా వుంది సుజీ" అన్నాను నవ్వుతూ.

"ఇందులో కష్టం ఏముంది సార్, ఇది కూడా ఓ పనేనా" అన్నది చాలా తేలిగ్గా.

పెద్దగా అలసిపోయినట్టు కనిపించటం సుజాతకు ఇష్టం వుండదు. పని విషయంలో ఒళ్ళు దాచుకునే మనిషి కాదు. నా పనులను కూడా తానే ఎంతో ఓపిగ్గా చేస్తుంది.

సిగరెట్టు వెలిగించుకుని పొగ లాగుతూ సుజాత కదలికను పరిశీలిస్తున్నాను.

మరోమారు కుర్చీలను సర్దింది. తర్వాత టేబిల్ మీద ఫ్లవర్ వాజ్ లో వున్న ప్లాస్టిక్ పువ్వులను అటూ ఇటూ కదిపి మరోమారు అమర్చింది.

"పాప ఇంకా నిద్ర లేవలేదా?" అడిగాను.

"లేదు. ఇంతకు ముందే పడుకుంది. ఇక లేపాలి. గెస్ట్లు వచ్చే వేళయ్యింది" అన్నది లోపలకు వెళుతూ.

ఈరోజు మా పాప మూడవ పుట్టిన రోజు. అందుకే అంత హడావిడి. మాకు పెళ్ళయిన మూడేళ్ళకు పుట్టింది పాప. పాప తర్వాత ఇంకా పిల్లలు లేరు. అందుకే పాపంటే మా ఇద్దరికీ ప్రాణం. దాని పుట్టిన రోజును కొంచెం గ్రాండ్ గా చెయ్యటం మామూలే. ఇంతకు ముందు రెండు పుట్టినరోజు పండుగలనూ చాలా ఘనంగా చేశాము.

ఆ రోజు సుజాత తన ఫ్రెండ్స్ ఇళ్ళకి పోయి పార్టీకి రావలసిందిగా పిలిచివచ్చింది. నేను ఆఫీసుకు వెళ్ళి ఆఫీసర్ని, ఇతర స్టాఫునూ పిల్చాను. అందరూ తప్పకుండా వస్తామని ప్రామిస్ చేశారు.

సాయంత్రం నాలుగు గంటలకల్లా ఆర్డరిచ్చిన కూల్ డ్రింక్స్ వచ్చేశాయి. ఓ యాభై కుర్చీలను కూడా తెప్పించాము. స్వీట్స్ హోటూ కూడా బయట కొని తెస్తానన్నాను కాని సుజాత ఒప్పుకోలేదు. స్వీట్స్ సుజాత బాగా చేస్తుంది

ఇల్లంతా నీట్ గా సర్ది తనే డెకొరేట్ చేసింది. నేను ఏదైనా పనిలో సాయం చెయ్యబోయినా ఒప్పుకోలేదు "ఎందుకు సార్ మీ హెల్ప్ నేనొక్కదాన్నే చెయ్యగలను. మీరు హాయిగా సిగరెట్లను నసిరేస్తూ కూర్చోండి" అన్నది నవ్వుతూ

ఆరున్నర అయ్యేసరికి అన్ని ఏర్పాట్లూ పూర్తయిపోయాయి పాపను నిద్రలేపి మొహం కడుక్కొచ్చి డ్రెస్ చేసింది "ఎలా వుంది దీని మేకప్" అని అడిగింది పాపను చూపుతూ.

"నీ మేకప్ అమోఘం" అన్నాను పాపను చేతిలోకి తీసుకుంటూ—

"థాంక్యూ సర్" అన్నది పాప ఖరీదైన ఫ్రాక్ ను సరిచేస్తూ.

పాప నవ్వుతోంది.

"అందాల పాప దీనికి తప్పకుండా ఈ రాత్రికి దిష్టి తగులుతుంది" అన్నది సుజాత.

"ముందు నీకు తగులుతుంది. ఇంత పనీ నువ్వొక్క దానివే చేశానని ఎవరితోనూ అనకు" అన్నాను పాపను ఆమెకు ఇస్తూ.

నవ్వింది.

మరో సిగరెట్టు వెలిగించుకుంటూ బయటకు నడిచాను. అప్పుడే ఎదురింటి ముందు రిక్షా ఆగింది. అందులో నుంచి

సరస్వతి దిగింది. ఎక్కడికి వెళ్ళివస్తున్నదో... ఇంట్లోకి వెళబోతూ నన్ను చూసి ఆగింది.

"ఏమిటి బావగారు బయట నిలబడ్డారు, ఇంకా అతిధులు రాలేదా?' అన్నది.

"మొదటి అతిధివి నువ్వే, కొంచెం ముందు వచ్చి మీ అక్కకు సాయం చెయ్యకూడదూ" అన్నాను.

"ఏమిస్తారు నాకు ప్రత్యేకంగా."

"థాంక్స్ చెప్పుకుంటాను."

"చాలదు. రెండు డ్రింక్‌లూ, మూడు స్వీట్లూ ఎక్కువ ఇవ్వాలి"

"ఒప్పుకున్నటే"

"ఐతే ఒక్కనిమిషంలో వస్తాను" అని ఇంట్లోకి వెళ్ళి ఐదునిముషాల తర్వాత చీర మార్చుకుని వచ్చింది సరస్వతి ఆమె బి.యే. ఫస్టియర్ చదువుతోంది.

లోపలకు రాగానే అందంగా వున్న పాపను ముద్దు పెట్టుకుంది. "నీకు నా బర్త్‌డే శుభాకాంక్షలే" అన్నది నవ్వుతూ.

క్రమంగా ఒక్కొక్కరే అతిధులు రావటం మొదలపెట్టారు. ఆఫీసు స్టాఫంతా కలిసే వచ్చారు. సుజాత ఫ్రెండ్స్‌లో కూడా చాలా వరకు వచ్చేశారు.

ఒక్కొక్కరే పాపను నవ్వుతూ పలకరించారు. కొంతమందిని చూసి పాప నవ్వింది, మరికొంత మందిని చూడగానే నోరు తెరిచింది.

కొంచెం ఆలస్యంగానే మా ఆఫీసర్ వచ్చాడు.

పార్టీ మొదలయ్యింది.

సుజాత - సరస్వతి అతిధులందరికీ ముందు స్వీట్సు డిస్ట్రిబ్యూట్ చేశారు.

మాట్లాడుకుంటూ, నవ్వుకుంటూ అటూ ఇటూ కదులుతున్నారు అతిధులు.

టీ కూడా తినటం పూర్తయిన తర్వాత కూల్‌డ్రింక్స్ ఇచ్చారు సరస్వతీ-సుజాత.

"కూల్ డ్రింక్సేనా, హాట్ డ్రింక్స్ కూడా వున్నాయా" అన్నాడు మా హెడ్ క్లర్కు వెంకటాచలపతి నవ్వుతూ.

"అవి మన పుట్టిన రోజుకు" అన్నాను నేను నవ్వి. ఆయన చేపలా తాగులాడు ఆయనకు ఇలాంటి కూల్ డ్రింక్స్ కంటికి ఆనవు

ఏనిమిది గంటలకల్లా పార్టీ పూర్తయ్యింది.

ఏర్పాట్లు బాగ జరిగాయని నన్నూ, సుజాతనూ మెచ్చుకుని ఒక్కొక్కరే వెళ్ళిపోయారు

చివరికి సుజాత, సరస్వతి నేను మిగిలిపోయాము

"నీ ఎక్స్‌ట్రా డ్రింక్‌లూ, స్వీట్లూ తీసుకో" అన్నాను సరస్వతిని

"వద్దులెండి బావగారూ మీరే తగండి కష్టపడ్డారు" అని వెళుతున్నానని చెప్పి వెళిపోయింది సరస్వతి

ఆమె వెళగానే సుజాతను అడిగాను "ఏమిటలా వున్నావ్ సుజీ ఏమయ్యింది? ఒంట్లో బావుండలేదా?" అని.

"ఏంలేదండీ" అన్నది.

నిజానికి ఏదో వున్నది. ఆమెలో వున్నట్టుండి ఏదో మార్పు వచ్చింది. మొహంలో కళ తగ్గిపోయింది. ఒక రకమైన నిరుత్సాహం ఆమెను ఆక్రమించుకున్నాయి.

"ఏదో వుంది సుజా నువ్వు దాస్తున్నావు" అన్నాను.

"మీరేమి అనుకోనంటే చెబుతాను. నన్ను అపార్థం చేసుకోగూడదు."

"అలాగే చెప్పు"

"మనం ఈ పార్టీని బహుమతులకోసం ఏర్పాటు చెయ్యలేదు గదా"

"అవును"

"ఇదే మనల్ని ఎవరైనా పార్టీకి పిలిస్తే ఏదో ఒక బహుమతి తీసుకువెళతాము కదూ."

"అవును."

"చూశారా మీ ఆఫీసు స్టాఫులో ఒక్కరు కూడా పాపకు చిన్న బహుమతి తీసుకు రాలేదు. అందరూ గొప్పవాళ్ళే. బహుమతుల కోసమని కాదు ఇలా మాట్లాడటం. అది కనీస మర్యాద కదా. మీరు మీ ఆఫీసర్ చిన్నకొడుకు బర్త్‌డే పార్టీకి వెళుతూ నలభై రూపాయలు పెట్టి, ఓ గిఫ్ట్ తీసుకు వెళ్ళారు గదా- మర్యాద కోసం .. ఆయనకు మాత్రం ఆ మర్యాద అవసరం లేదా?"

సుజాతను నేను అర్థం చేసుకున్నాను. మా సంతోషం కొద్దీ మేము పాప బర్త్‌డేకి పార్టీ ఇచ్చాము. అయినా మర్యాదకోసం ఓ బహుమతి తీసుకురావటం రివాజు. అది ఎదుటివాళ్ళ పట్ల గౌరవాన్ని తెలియజేస్తుంది.

సుజాత ఫ్రెండ్స్‌లో మాత్రం ఎవరో ముగ్గురు పాపకు ఆటబొమ్మలు తెచ్చి ఇచ్చారు. అంతకు మించి ఎవ్వరూ ఏమీ ఇవ్వలేదు

"డోంట్ వర్రీ సుజా, మనం బహుమతుల కోసం పాప బర్త్‌డే చెయ్యలేదు. ఈ విషయం గురించి ఇక ఆలోచించకు" అన్నాను

సుజాత ఏదో మాట్లాడ బోయింది. ఇంతలోనే బయటనించి ఎవరిదో పిలుపు వినిపించింది

"ఎవరూ?" అన్నాను.



# విలువైన బహుమతి

"నేను బాబూ" అంటూ లోపలకు వచ్చాడు రంగయ్య. అతను మా ఆఫీసు ప్యూను. అతని చేతిలో చిన్న ప్యాకెట్టు వుంది. ఆశ్చర్యపోయాను అతని రాకతో. ఆఫీసులో అందర్నీ పిలిచానుగానీ రంగయ్యను మాత్రం పిలవలేదు. అసలు నాకు పిలవాలని అనిపించలేదు. ముసలివాడు - అందులోనూ ప్యూను. అందుకే పిలవలేదు.

"ఇంతకు ముందే తెలిసింది బాబూ మీ అమ్మాయిగారి పుట్టిన రోజు ఇవాళని. వచ్చాను ఇదిగో బాబూ నా శక్తి కొద్దీ ఏదో తెచ్చాను. మీ లాంటి వాళ్ళు తొడిగేది కాదు, అయినా నా సంతోషం కొద్దీ—నన్ను క్షమించండి బాబూ!" అని ప్యాకెట్టులో వున్న గౌనును బయటకు తీసి సుజాత చేతికి ఇచ్చాడు.

స్థాణువులా అయిపోయాము సుజాత — నేను అతని చేష్టలకు.

సిగ్గనిపించింది. అవమానమనిపించింది. ఏ మనిషిని నేను పిలవటానికి సందేహించానో ఆ మనిషే ఇప్పుడు నన్ను తన అభిమానంతో చంపేస్తున్నాడు.

సుజాత కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

గబగబా పాప వొంటి మీద వున్న ఖరీదయిన ఫ్రాక్‌ను విప్పి, రంగయ్య తెచ్చిన చౌకరకం పువ్వుల గౌనును తొడిగి పాపను రంగయ్య చేతులకు ఇచ్చింది.

ఆశ్చర్యంగా కళ్ళు పెద్దవి చేసి బొద్దు మీసాల రంగయ్యను చూసింది పాప.

నోటితో చప్పుళ్ళు చేసి పాపను నవ్వించాడు రంగయ్య

"చక్కని చుక్క, పెద్దయితే మహారాణవుతుంది బిడ్డ" అని దాన్ని సుజాతకు ఇచ్చాడు.

షాక్ నించి తేరుకుని, రంగయ్యకు డ్రింక్ ఇవ్వబోయాను.

"నా కెందుకు బాబూ అవన్నీ. బిడ్డను చూద్దామని వొచ్చాను. అంతే నే వెళ్తాను బాబూ, వెళ్ళొస్తానమ్మా" అని మా ఇద్దరికీ నమస్కారం చేసి వెళ్ళిపోయాడు రంగయ్య. అతను వెళ్ళగానే సుజాత కేసి చూశాను. ఆమె మొహంలో ఇంతకుముందు వున్న నిరుత్సాహం, అసంతృప్తి ఇప్పుడు లేవు.




# రికరి®
## ఇన్‌స్టెంట్




*ఇది ఫిల్టర్
కాఫీ వలెనే యెంతో
రుచిగా ఉంటుంది కాబట్టి
తేడాచెప్పడం చాలాకష్టం.*

నెస్ కఫే ఉత్పత్తిదార్లనుండి-ప్రపంచమంతటా కాఫీ శ్రేష్టత తెలిసినవారు

SAA/FSL/R/1135

# వారఫలం

**6-6 1980 శుక్రవారం మొదలు**
**12 6 1980 గురువారం వరకు**

మేషం : కుటుంబంలో సంతోష సంఘటనలుండగలవు. దాయాది వర్గంతో పరిష్కార మార్గాలుండగలవు. చాలా దినాలుగా నిలచిన బాకీలు వసూలు కాగలవు. ఉద్యోగ వృత్తులలో ప్రగతి గలదినం క్రీడా రంగంలో చాలమందికి అధికంగా అవకాశాలుంటాయి. స్త్రీలకు : ఉద్యోగం బాగుంటుంది. లలిత కళాభ్యాసం గల వారికి ఆదాయం, అభివృద్ధి, సుఖ శాంతులుండగలవు. వ్యాపారం చేసేవారైతే అధిక లాభార్జనగలదు.

వృషభం : ఆదాయమున్నది వృత్తిలో అధికంగా అవకాశాలుండగలవు. నగలు కొనే ప్రయత్నమున్నది. అప్రయత్న ధనాదాయం కనిపిస్తుంది. బంధు వర్గీయులకు, తప్పనిసరిగా మీరు సహాయం చేయవలసిన పరిస్థితులుంటాయి. ఆరోగ్య భంగముంది, ఒక వేళ చాలమందికి, హాస్పెటల్‌లో చేరే ఇబ్బందులుండగలవు.

మిధునం : గ్రహ స్థితి మీకు అనుకూలంగా ఉన్నది. ఇక భారీ వ్యాపారం చేయటానికి అవకాశాలున్నాయి. ప్రయత్నం లేకనే మీకు ధనాదాయముంటుంది. కృషి చేయండి. ఈ వారంలో మీ ధనార్జన చాలా తృప్తికరంగా ఉండగలదు. సంతానాన్ని గూర్చిన ఆనంద శుభకార్య నిర్వహణకు అనుకూల దినలు.

కర్కాటకం : పోయిన వస్తువులు మరలా సంపాదించుకోవలసినదేగాని, అవి మీకు లభిస్తాయనే నమ్మకం లేదు. మీరు రచనా వ్యాసంగంలో నిమగ్నులైతే అదికావకాశ మేర్పడగలదు. ప్రయత్నించి, ఇంతకు ముందు ఆశ వదులుకున్న కార్యాలు నిర్విఘ్నంగా నెరవేరగలవు. మీ కార్యదక్షత, విచక్షణా జ్ఞానం మీకు సహాయపడగలదు. స్త్రీలకు: అప్రయత్నంగా ఆదాయంగలదు.

సింహం : ఏం చెప్పాలి? రాశిలో స్థితులైన నాల్గు గ్రహాలు, అనేక రీతుల ఇబ్బందులు కలుగ చేయనున్నారు. చాల మందికి బాకీలు వసూలు కాకపోవడం, చేయి జారిపోయిన వస్తువులు మరలా చేతికి అందే అవకాశాలు లేవు. దైవ పుణ్య కార్యాలు నెరవేరగలవు. వ్యయం అదికం. మానసిక వ్యధకు దారి తీసే గ్రహ స్థితి గలదు. స్త్రీలకు : క్రీడా రంగంలో అధికమైన అవకాశాలుండగలవు. ఉద్యోగ వృత్తులలో ఇబ్బందులుంటాయేమో !

కన్య : నూతనంగా వ్యాపారం చేయదలచారుగా ! కొందరు భారీ వ్యాపారం చేయాలనీ, విదేశాలకు ప్రయాణించాలని ఉబలాటముంటుంది. వ్యాపార లాభంగాని, ప్రయాణానుకూలతగాని, లాభార్జన చేయటంగాని, చాల నిదానంగా నెరవేర్చాలి. మంచి రోజులు ముందున్నాయి. స్త్రీలకు : లలిత కళాభ్యాసకులకు, కళా రంగంలో చొరవగలవారికి, గ్రంథ కర్తృత్వం

# రోజంతా కష్టించినతర్వాత...





## ఆ ముఖకాంతిని మళ్ళా తెచ్చుకునే తీరు

పగటిపూట అలా వాడిపోయిన మీ చర్మానికి మళ్ళా ఆ కాంతిని ప్రతి రాత్రీ తిరిగి సమకూరుస్తుంది—పాండ్స్ లెమన్ కోల్డ్ క్రీమ్. అందాన్నిచ్చే నూనెలు, చర్మంలోగల తేమ, సరిగ్గా సరియైన పాళ్ళలో ఉన్నాయి దీన్లో...మీ చర్మాన్ని సుతిమెత్తగా, మృదువుగా, అందంగా అట్టేపెడుతుంది... మృదుత్వాన్నిచ్చే నిమ్మలోని ఆ తాజాదనాన్ని యిస్తుంది.




# పాండ్స్ లెమన్ కోల్డ్ క్రీమ్

**రోజంతా వాడిపోయిన మీ చర్మానికి మళ్ళా ఆ మృదుత్వం.**

## వారఫలం

గల వారికి ఆదాయమున్నది. చాలా మందికి క్రీడా రంగంలో గౌరవ గల్గుతుంది.

తుల : ఈ వారం మీకు బాగా అనారోగ్యత కల్గే సూచనగలదు. జాగ్రత్త! ఆహార విహారాదుల్లో చాలా జాగ్రత్తగా ఉండాలి. ఉద్యోగంలో చాలామందికి ప్రమోషన్ ఆశింపవచ్చు. వ్యాపారంలో అనుకూల వారమే. భూముల గూర్చియో, గృహాన్ని గూర్చియో పరిష్కారాలోచనలుండగలవు. స్త్రీలకు : ధనాదాయం తృప్తికరంగా ఉండటమేగాక, ఉద్యోగంలో అనుకూల మార్పులుంటాయి.

వృశ్చికం : ప్రయత్నం చేయకుండా పనులు నెరవేరవలెనని అనుకోవడం తగదు. కృషి చేయుటం ఎంతైనా అవసరం. పోయిన వస్తువులు దొరకటం కూడా వార విశేషమే. వ్యవసాయంలో చాల మంది కొన్ని మార్పులు చేయగలరు. సంతానాన్ని గూర్చిన ఆనందముంటుంది. స్త్రీలకు :సాంఘిక వ్యవహారాల్లో గౌరవం, భూములను గూర్చిన ఆదాయం, సభా గౌరవం చెప్పదగిన వారం

ధనస్సు : మీకు అనుకోకుండా వ్యయం జగుతుంది. మిత్రులో, బంధువులో ఇంటికి రావటం, శుభ కార్య ప్రస్తావనలు, నిర్మాణ కార్యక్రమం,వ్యాపార సంబంధంగా ఐక్యం అధికం కావటం సంభవం. చిత్ర రంగంలో పరిశ్రమ చేసే వారికి సర్వానుకూల మైనవారం. స్త్రీలకు దైవకార్యాలు, పుణ్య కార్యాలు, నెరవేరగలవు సంతానాన్నిగూర్చిన ఆనందం ఉండ గలదు.

మకరం మీ వృత్తి వ్యాపారాలకు అడ్డం కులుగాగలవు. ప్రక్కన చేరిన వారిని బాగా గమనించి నడుచుకోవటం ఎంతైనా మంచిది చుట్టు ప్రక్కల వారితో కీచులాటలుంటాయేమో చూచుకోండి. నమ్మిన ద్రోహులు వెంటబడుతుంటారు. మీరు తలంచిన కార్యక్రమం, చివరి రెండు రోజులలో నిర్విఘ్నంగా నెరవేరుతుంది. ఉద్యోగంలో ఇబ్బందు లుంటాయేమో! చాల మంది జాగ్రత్తగా నడుచు కోవాలి.

కుంభం : ఈ రాశి వారు యువకులలో, చాలా మందికి, కళారంగంలో అవకాశాలుండ గలవు. చాలామందికి బహిరంగఖ్యాతిఅతిశయింపగలదు.వయసు వచ్చిన కన్యలకు వివాహ యోగ్యత ఒకటి రెండు మాసాలలో సిద్ధింపగలదు. ఉన్నత విద్యార్జనకు ప్రాకులాడే వారికి కలిసి వచ్చే వారమే. స్త్రీలకు : కళారంగ ఖ్యాతి, పత్రికా గౌరవం, రచనలో ప్రగతి సూచన సంభవం.

మీనం: చాలా మంది భూములు కొనగలరు. పెట్టుబడి పెట్టినవ్యాపారం అధికాదాయ ప్రదంగా సాగుతుంది. కాని ప్రభుత్వాధికారుల అజమాయిషీకి అందే లోపం చేయరాదు. న్యాయంగా సంచరించడం ఎంతైనా మేలు.ధర్మకార్యాలు ఆచరించుటలో లోపం రాదు. ఆరోగ్యంలో అసలే మార్పు లేదు. స్త్రీలకు : లలిత కళా ప్రావీణ్యత రాణించడం, స్వల్పాదాయం సంభవించడం ఈ వారం లక్ష్యం.

— విద్వాన్ కోట సత్యరంగయ్య శాస్త్రి

# "ఈగిల్ ప్రిన్సెస్ గురించి వేరే చెప్పాలా?"






**"ఇది అందమైనది..."**

ఆతిథ్యం ఇచ్చే మోహనాంగి.

**"ఇది అద్వితీయమైనది..!"**

దుమ్మును ఏమాత్రం లోనికి పోనివ్వదు...24 గంటలకు పైగా
వేడిని ఏమాత్రం బయటికి రానివ్వదు.



**"మరేమిటనుకున్నారు,
ఇది ఈగిల్ వాక్యూమ్ ఫ్లాస్కు."**




**ఈగిల్ శ్రేణిలో 123 వేర్వేరు నమూనాలు.**

CASE-119-244-TEL





# ఫాలాక్షుని డైరీ

(14వ పేజీ తరువాయి)

## తమిళనాడుకు తెలుగు పాలు!

ఆంధ్ర దేశం నుంచి తమిళ దేశానికి రోజూ నలభై వేల లీటర్ల పాలు పోతున్నాయట. తమిళనాడు ప్రభుత్వ పాల సరఫరా సంఘం మన రాష్ట్రం నుంచి రోజుకు 40వేల లీటర్ల పాలు కొనుక్కునేట్టు, మన రాష్ట్రం అమ్మేట్టూ ఒప్పందాలు జరిగాయట— అయ్యో! మన వూళ్లో పాలు లీటరెలా!!

### ఆత్మహత్యకి దారి తీసిన గృహకలహాలు!

తిరుపట్టిపట్టి గ్రామానికి చెందిన రామసుందరం అనే అతని భార్య 23 ఏళ్ల రాజమ్మ భర్తతో పోట్లాడి తన మూడేళ్ళ కూతురును తీసుకుని పుట్టింటికి వెళ్ళిందట. అక్కడ ఆమెకూ, ఆమె తల్లికి, అన్నగారితో భయంకర పోరాటమయ్యేసరికి తల్లీ, ఆమె, పసిపిల్లను తీసుకుని మెట్టూరు వెళ్లి ఆనకట్ట మీదనుండి ప్రవాహంలోకి దూకేశారట. రాజమ్మ, ఆమె కూతురూ చచ్చిపోయారట. ఈతొచ్చిన ఆమె తల్లి యీదుకుంటూ ఒడ్డుకొచ్చేసరికి పోలీసులు ఉన్నట్టి ఆమెను పట్టేసి, ఆత్మహత్యా నేరమారోపించి, స్టేషనుకు తీసుకు పోయారట!

### పాత కక్షలకి పంట ఆహుతి!

నెల్లూరుకు ముప్పయి మైళ్ల దూరంలో ఉన్న బద్వేలు గ్రామంలో మొన్న ఏప్రియల్ 14వ తేదీన లక్ష్మంసెట్టి ఓశయ్య అనే ఆయనకు చెందిన ఎనిమిదెకరాలలోని వరి కుప్పలను పాతరాజు నాగయ్య అనే ఆయన, ఆయన అనుయాయులు కలిసి తగుల బెట్టారట. సుమారు ఇరవై అయిదువేల రూపాయల విలువ ఫలితం నాశనమయిందట. ఈ చర్యకు పాత కక్షలు కారణమని పోలీసులు అంటున్నారట!

### బ్యాంక్ వ్యాను పై బందిపోట్లు!

ఏప్రియలేడో తేదీన వాణి పూరుకు చెందిన ఇంపాల్‌లోని యునైటెడ్ బ్యాంకుకు చెందిన ఒక వ్యాను మీద ముసుగులు బందిపోట్లు విరుచుకుపడి, డ్రయివర్ను బెదిరించి దింపి, గార్డును కాల్చి చంపి, వ్యానులో లక్ష రూపాయలూ తస్కరించారట. పట్టపగలు పబ్లిక్‌గా బందిపోట్లు! కాదా!

### ప్రేమికుని ఆత్మహత్య!

బొంబాయిలోని బాబా అటామిక్ రీసెర్చి సెంటరులో సైంటిఫిక్ ఆఫీసరుగా పని చేస్తున్న 25 సంవత్సరాల లింగేగౌడ్ అనే అతడు ఆ సంస్థలో పని చేస్తున్న ఒకామెను ప్రేమించాడట. తీరా తన ఆప్తమిత్రుడు కూడా ఆమెని ప్రేమిస్తున్నాడని తెలిసి, అతని ప్రేమకు అడ్డు రావడం ఇష్టం లేక, తన ప్రేమను చంపుకోడం కుదరక యీ విషయం ఓ పుత్తరంలో రాసి, ఆత్మహత్య చేసేసుకున్నాడట. ●




## బియ్యంపిండి అప్పడములు

మొదట ఒక కిలో బియ్యం రాళ్ళు లేకుండా బాగు చేసుకుని అందులో మూడు గ్రాముల సగ్గుబియ్యం కలిపి మెత్తటి పిండి క్రింద మర పట్టించాలి. ఆ పిండిలో నించి ఒక గ్లాసు పిండి ఒక గిన్నెలో పోసి పూరీల పిండి లాగ నీరు పోసి కలపాలి. తరువాత యిడ్లీ స్టాండు తీసుకుని అడుగు రెండు పళ్ళెములలో కలిపి ఉంచుకున్న పిండిని ఎనిమిది యిడ్లీల క్రింద పెట్టి కుక్కరులో ఉడికించాలి. కుక్కరు పైన వెయిటు పెట్టనక్కరలేదు. సరిగ్గా 10 నిమిషములలో ఉడికిపోవును. రోటిలో నాలుగు పచ్చిమిరపకాయలు, కొద్దిగా యింగువ ముక్క, తగినంత ఉప్పు వేసి మెత్తగా దంపి యిడ్లీల క్రింద ఉడికిన పిండిని కూడ వేసి మెత్తగా దంపవలెను. పిండిమీద నూని రాస్తే బండకు అంటుకుపోకుండా దంపుటకు తేలికగా ఉండును. ఉడికిన పిండి గనుక ఎంతసేపో దంపనక్కరలేదు. ఉండలాగ వచ్చేవరకు దంపుతే చాలును. దంపి మెత్తపడగానే ఒక నిమ్మపండు రసము పిండి రసం పిండిలో కలిసే వరకు ఒకసారి దంపి తీసి ఒక స్టీలు గిన్నెలో పెట్టి గాలి తగలకుండా మూత పెట్టి ఒక గంటసేపు నానబెట్టవలెను.

గంట అయిన తరువాత చిన్న చిన్న ఉండలు చేసుకుని అప్పడాల కర్రతో బియ్యంపిండి ఒత్తుకుంటూ మినప అప్పడములాగే ఒత్తుకోవలెను. దీనికి ఎండ ఎక్కువ అక్కరలేదు. నీడ పట్టున యింట్లో ఆరబెడితేనే ఆరిపోవును.

ఇవి ఎండిన తరువాత నూనెలో వేయించుకుంటే చిన్న అప్పడము పెద్దదిగా అయి తినుటకు చాల బాగుండును. నోట్లో వేస్తే కరగిపోవును. చంటిపిల్లలకు కూడ పెట్టవచ్చును. జబ్బు చేయదు.

ఒక గ్లాసు పిండికి ఒక నిమ్మకాయ రసము పిండవలెను. ఈ కొలత ప్రకారం ఎవరెంత చేసుకుంటే దానికి తగ్గట్టుగా నిమ్మకాయలు రసం పిండుకోవలెను.

— కిళాంబి సత్యవతీదేవి

## మొమైపాక్

కావల్సిన వస్తువులు :- మొక్కజొన్న కండెలు — 4. శెనగపిండి — 1 కప్పు. నెయ్యి — 300 గ్రా, చక్కెర — 300 గ్రా, జీడి పలుకులు — 18.

తయారుచేయు విధానము :— మొక్కజొన్న కండెలు లేతవి తెచ్చుకొని, గింజలు తీసి, కొద్దిసేపు నీళ్ళల్లో నానబెట్టి, తక్కువ నీళ్ళు పోస్తూ మెత్తగా రుబ్బుకోవాలి. ఈ రుబ్బిన ముద్దను మందపాటి గిన్నెలో వేసి, సన్నని సెగపై కమ్మని వాసన వచ్చేవరకు పొడి పొడిగా వేయించాలి.

ఇంకో పాత్రలో శెనగపిండిని సన్నని సెగపై వేయించాలి. ఈ వేయించిన రెండు పిండ్లూ కలిపి ఒక పాత్రలో వేసి పెట్టుకోవాలి. చక్కెర తీగపాకం పట్టి, దాంట్లో యీ పిండ్లు పోస్తూ కలపాలి. నెయ్యి పోయాల్యాలి. నెయ్యి అంతా యిగిరి పదార్థం కుదుట పడ్డాక— అంటే బుసబుసగా నురుగు వస్తూ ఉండగా—పళ్ళెంలో పోసి చదును చేసి, కొంచెం సేపయ్యాక ముక్కలు కోసి, ఒక్కొక్క ముక్కపై ఒక్కొక్క జీడి పలుకు గుచ్చాలి. పై కొలతకి 18 ముక్కలు అవుతాయి. నిలవ కూడా ఉంటాయి. "మొమైపాక్" అంటే 'మొక్కజొన్న మైసూర్‌పాక్' అని అర్థం.

— కల్లికి నాగరాజ్

## నర్సరీ గేయాలపై గోష్ఠి :

ఆంధ్ర బాలానందసంఘం ఆడిటోరియంలో మే10—11తేదీలలో నర్సరీగేయాలపై ప్రయోజనకరమైన గోష్ఠి జరిగింది. ఆస్థానకవి డాక్టర్ దాశరథి కృష్ణమాచార్యులు అధ్యక్షత వహించారు. శ్రీ న్యాయపతి రాఘవరావుగోష్ఠిని ప్రారంభిస్తూ, ఇంగ్లీషు మీడియం వ్యామోహంలో పడి మన పిల్లలు వారి తల్లులు తెలుగు బాలగేయాలు, ముఖ్యంగా శిశు[నర్సరీ]గేయాలు మరచిపోతున్నారని, వాటిని రక్షించుకోవాలని, ఆంధ్ర బాలానంద సంఘం అలాటి పాటలను పెక్కింటిని రికార్డు చేయించిందని అంటూ, నేటి తల్లులకు వాటిపట్ల అభిరుచి కలిగించడానికి ఉద్యమం నడపాలని ఆయన కోరారు. డాక్టర్ దాశరథి తమ ప్రసంగంలో ప్రతి వారూ బాల వాఙ్మయకర్తలు కాలేరని, దానికొక నైపుణ్యం అవసరమని అన్నారు. బాలసాహిత్యంనుంచే రచయితలు రావాలనిఆయనఅన్నారు.కాలిఫోర్నియాలో బాల వాఙ్మయవికాసానికి సంబంధించినప్రదర్శనం చూచానని, ఆడిటోరియమే తిరిగి పోతూ 45 నిమిషాలలో వికాస చరిత్ర తెలుస్తుందని అన్నారు. బాల గేయాలకు స్వరకల్పన కూడా ఒక కళ అని అన్నారు. దేశంలో టెలివిజన్ కార్యక్రమం అభివృద్ధి చెంది, దానిలో సగం పిల్లల కార్యక్రమాలు ఉండాలని

# హైదరాబాదు నోట్‌బుక్

ఆయన సూచించారు. శ్రీ పాల గుమ్మి విశ్వనాథం ప్రసంగిస్తూ పిల్లల విషయంలో రచయిత నిజాయితీతో ప్రవర్తించాలన్నారు. పిల్లల మనస్తత్వం గ్రహించి, రచన చేయాలన్నారు. సంస్కృతి పోతుందేమోనన్న ఆవేదనలో ఉత్తమ బాల గేయాలు ఉద్భవిస్తాయన్నారు. దానికి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి రచించిన 'సీతా సీతానాగ్' మున్నగు గేయాలు ఉదాహరించారు. శ్రీమతి తురగా జానకీరాణి ప్రసంగిస్తూ, ఏ గూటి చిలుకకు ఆ గూటి మాటలేనన్న సామెతగా పిల్లలు తమ వాతావరణాన్ని అనుసరించి మాటలు భాష నేర్చుకుంటారని, పెదవు కదలికను బట్టి అనుకరిస్తారని, పున : పుస్యం ప్రధానమని అన్నారు. ఇంగ్లీషు నర్సరీ గేయాల కున్నంత ప్రచారం తెలుగు నర్సరీ గేయాలకు లేదని, వాటికి బహుముఖ ప్రచారం కావాలని ఆమె సూచించారు. ప్రభుత్వం పిల్లల కోసం సినిమాలు తీయాలని అన్నారు. శ్రీజీడిగుంట రామారావు తమ ప్రసంగంలో సాధారణ రచయితలు సంవత్సరానికొకటున్నా పిల్లల కోసం వ్రాయాలని, ప్రతినెల పిల్లల కోసం నాలుగైదు పుస్తకాలు రావాలని సూచించారు. పిల్లలే పుస్తకాలు పాఠ్య గ్రంథాలుగా పెట్టాలన్నారు. శ్రీ పాలడుగు నాగయ్య ప్రసంగిస్తూ, జానపద గేయాలలో పిల్లల పాటలను గురించి వివరించారు. [illegible] ఎప్పుడు పుట్టిందో, కథ కూడా అప్పుడే పుట్టిందని అన్నారు. ప్రముఖ బాల వాఙ్మయ రచయిత శ్రీ రెడ్డి రాఘవయ్య ప్రసంగిస్తూ, పిల్లలను అంత్యప్రాసం ఆకర్షిస్తుందని, వారికది సహజమని అంటూ, "వెంకూ వెంకూ కుండ వెంకు, వెట్రోటోలు బంకు, బొంయ్యి మంచె జింకూ" అని ఇటీవల ఒక పిల్లవాడు తన ప్రత్యర్థిని ఉడికించడానికి అలవోకగా పాట కట్టాడని ఉదాహరించారు. చింత దీక్షితులు, వేటూరి ప్రభాకరశాస్త్రి, గిడుగు సీతాపతి మున్నగువారు బాల వాఙ్మయానికి చేసిన సేవను కొనియాడారు. సుప్రసిద్ధ తమిళ బాల వాఙ్మయస్రష్ట శ్రీ కవ్వి గోపాలకృష్ణన్ ప్రసంగిస్తూ, గేయ వాఙ్మయంలో ప్రాచీన మైనవి నర్సరీ గేయాలని అన్నారు. పిల్లలు తరచు అసహజతను, కల్పనను, ఊహా ప్రపంచాన్ని ఎక్కువగా కోరుతారని అన్నారు. పిల్లల

# హైదరాబాద్ నోట్‌బుక్

అధిరుచి మీదే తన శ్రీ పుస్తకాలు విజయాలు పొందాయన్నారు. జీవితంలో ఒకే ఒక బాల గేయం వ్రాశానని, దానిని విభాయించలేనవే అవిశ్వాసంతో, వచన రచనకు, అందులోను సైన్స్ శిక్షణకు పూనుకున్నానని అన్నారు. శ్రీ కవ్వి గోపాలకృష్ణన్ కేంద్ర ప్రభుత్వం నుంచి, రాష్ట్ర ప్రభుత్వంనుంచి,ప్రపంచవిజ్ఞానసమితి[ యునెస్కో] నుంచి పన్నెడు అవార్డులు పొందారు. ఇటీవల జాంబియాకు వెళ్లి అక్కడి పిల్లలను పరిశీలించి, వారిపై ఒక గ్రథం వ్రాశారు. వివేకవర్ధని ట్రెయినింగ్‌కాలేజి వైస్ ప్రిన్సిపాల్ శ్రీ మద్దిపట్ల వెంకటరావు ప్రసంగిస్తూ, తెలుగువారు ఇంగ్లీషు మీడియం వ్యామోహం వదలాలన్నారు. సర్సరీ గేయాలు పాడడానికి శిక్షణ శిబిరం నిర్వహించబడాలని ఆయన సూచించారు. పిదప [రెండవనాడు] బాల గేయాల గానం, వాటి అంద చందాల విశేషాల వివరణ జరిగాయి. బాలల అక్కయ్య శ్రీమతి కామేశ్వరి ధన్యవాదాలు సమర్పించారు.

**కూచిపూడి అకాడెమీ :**

ముఖ్య మంత్రి డాక్టర్ మర్రి చెన్నారెడ్డి ఏప్రిల్ 29న రవీంద్రభారతిలో కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీకి ప్రారంభోత్సవం జరిపారు. రాష్ట్ర హైకోర్టు న్యాయమూర్తి శ్రీ కె. మాధవరెడ్డి దీనికి అధ్యక్షులు. ప్రముఖ నాట్యాచార్యులు శ్రీ వెంపటి చిన సత్యం డైరెక్టరు. ప్రిన్సిపాల్ కుమారి శోభా నాయుడు. అకాడెమీలకు గ్రాంటు పెంచే ఉద్దేశముందని ముఖ్యమంత్రి తెలిపారు. ప్రారంభంలో శ్రీ వెంపటి చినసత్యం కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీ కొన్ని వందల సంవత్సరాలు నిలబడేట్టు కృషి చేస్తామని అన్నారు. చివర అకాడెమీ సభ్యులు శ్రీనివాస కళ్యాణం నృత్య నాటిక ప్రదర్శించారు. కూచిపూడి నాట్యకళలో శాస్త్రీయ శిక్షణ నివ్వడం ఈ అకాడెమీ లక్ష్యం. ఇది గురుకుల పద్ధతిలో నడుస్తుంది. నాలుగు సంవత్సరాల కోర్సు. జూన్ నుంచి శిక్షణ ప్రారంభమవుతుంది. ప్రతి విద్యార్థి 25 రూపాయల ఫీజు కట్టాలి. ప్రతిభగల విద్యార్థులకు ఉచిత శిక్షణ, స్కాలర్‌షిప్‌లూ యిస్తారు. శ్రీ వెంపటి చిన సత్యం ప్రస్తుతం మద్రాసులో కూచిపూడి ఆర్ట్స్ అకాడెమీని నిర్వహిస్తున్నారు. ఇది 1963లో ప్రారంభమయింది.

**సుర భారతి సమితి :**

సుర భారతీ సమితి నూతన కార్యవర్గం ఏప్రిల్ చివరి వారంలో జరిగింది. హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఆల్లాడి కుప్పుస్వామి అధ్యక్షులు. హైకోర్టు న్యాయమూర్తి శ్రీ ఎ. రఘువీర్, శ్రీ దేవులపల్లి రామానుజరావు, ప్రముఖ న్యాయవాది శ్రీ యడవల్లి శివరామశాస్త్రి ఉపాధ్యక్షులు. డాక్టర్ శ్రీరామచంద్రుడు ప్రధానకార్యదర్శి. శ్రీ ఎం. రామప్ప [అంతర్జాతీయ తెలుగు సంస్థ డైరెక్టరు] కోశాధిపతి. డాక్టర్ ఎం. గోపాలరెడ్డి సంయుక్త కార్యదర్శి. శ్రీ రవ్వ శ్రీహరి సహాయ కార్యదర్శి. న్యాయమూర్తి శ్రీ కె. పులస్తయ్య. డాక్టర్ సి. నారాయణరెడ్డి, శ్రీయుతులు బి. వి. సుబ్బారాయుడు, టి. వీరభద్రయ్య, డాక్టర్ బి. ఎ. ఎల్. నారాయణరావు, కె. ఆర్. సుబ్రహ్మణ్యం, డాక్టర్ కె.కమల కార్యవర్గ సభ్యులు. డాక్టర్ ఐ. జి. లాల్యే, డాక్టర్ ఇరువంటి కృష్ణమూర్తి ప్రత్యేకాహ్వానితులు.

**ఉపశ్రుతి :**

రాష్ట్ర ప్రభుత్వ సచివాలయం గోడ వెంబడి వందల కొలదిమేకలు మందవేశాయి. ఒక జిజ్ఞాసువు "ఈ మేకలు ఇక్కడెందుకు సార్?" అనడిగాడు. ఏంచెప్పను? నాకు ఏమీ తోచలేదు. మంద వేయడం పొలాల్లో పంటకు ఎరువుకోసం. మరి సచివాలయం ముందు ఏ పంటలు! మీకేమైనా కారణాలుతెలిస్తే చెబుదురూ!

— తిరుమల రామచంద్ర



# అవీ - ఇవీ - అన్నీ

### పెద్దన్న కవితా వైభవం

డా. వల్లా దుర్గయ్య రచన పెద్దన కవితా వైభవం పుటలు 74 మా కార్యాలయం చేరింది. వెల 5 రూపాయలు.

### కంకంటి కవితా వైభవం

శ్రీ "కరుణశ్రీ" రచన కంకంటి కవితా వైభవం మా కార్యాలయం చేరింది. పుటలు 60. వెల 3 రూపాయలు.

### కుందుర్తి కవితా వైభవం

శ్రీ అద్దేపల్లి రామమోహనరావు రాసిన కుందుర్తి కవితా వైభవం అనే 53 పుటల గ్రంథం మా కార్యాలయం చేరింది. వెల 3 రూపాయలు.

### రామాయణ పరమార్థం

డా. ఇలపావులూరి పాండు రంగారావు రచన రామాయణ పరమార్థం — 70 పుటల గ్రంథం మా కార్యాలయం చేరింది. వెల 5 రూపాయలు. ఈ పై ప్రతులన్నింటికి యువభారతి, సాహితీ సాంస్కృతిక సంస్థ, 5, కింగ్స్‌వే, సికింద్రాబాద్—33 వ్రాయవచ్చును.

### గంటల జెండాలు

కవితా సంపుటి. రచన : శ్రీ అలిసెట్టి ప్రభాకర్. 44 పేజీలు, వెల : 2—00లు. ప్రతులకు : రచయిత పేర స్టుడియో పూర్ణిమ, జగిత్యాల— 505327కి వ్రాయాలి.

### వేడి వెలుగులు

యువ భారతీయుల కవితా సంకలనం 68 పేజీలు, వెల రు. 3.00. ప్రతులకు 1] యువభారతి, కింగ్స్ వే, సికిందరాబాద్ — 500003. 2] యువ భారతి కార్యాలయం, ఆంధ్రసారస్వత పరిషత్ భవనములు, తిలక్ రోడ్డు, హైదరాబాద్ — 500001.

### భారతీయ పునరుజ్జీవనం

రచన : శ్రీ డి. రామలింగం. 88 పేజీలు, వెల : రు. 6.00. ప్రతులకు:1] యువభారతి, 5, కింగ్స్ వే, సికిందరాబాద్—500003. 2] యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు, తిలక్ రోడ్డు, హైదరాబాద్—500001.

### ఆలూరి బైరాగి సంస్మరణ సంచిక

ప్రముఖ కవి స్వర్గీయ ఆలూరి బైరాగి కవితా ప్రతిభని, జీవిత విశేషాలను వివరిస్తూ ఎందరో ప్రముఖులు వ్రాసిన రచనలనేకం ఈ సంచికలో ఉన్నాయి. 148 పేజీలు, వెల రు. 10.00. ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, ఏలూరురోడ్డు, విజయవాడ—2.

### చైతన్య కిరణాలు

చేతన సాహితీ సంకలనం. 20 పేజీలు, వెల : రు. 2—50లు. ప్రతులకు : శ్రీ వి. రాజేశ్వర ప్రసాద్, ఇం. నెం. 6/134, పార్క్‌వీధి, స్టోన్ హవుస్‌పేట, నెల్లూరు—2.

### శ్రీమద్భగవద్గీత

ఆంధ్రానువాదము. అనువాదకులు : శ్రీ పైడిపాటి అప్పిరెడ్డి. 150 పేజీలు. వెల : తెలియదు. ప్రతులకు : రచయిత పేర, నాగేంద్రపురం, మరకాలకుప్పం పోస్టు, చిత్తూరు తాలూకా [జిల్లా]కు వ్రాయాలి.





**Printed and Published by S. Nageswara Rao at the Andhra Patrika Press, Mallikarjuna Rao Street Gandhinagar, Vijayawada-3. Editor : S. Radhakrishna**

